

# మీ అభిమాన పత్రిక

చందమామ (తెలుగు, ఇంగ్లీష్, హిందీ, ఒరియా)ను, జూనియర్ చందమామను మీరిప్పుడు విశాఖపట్నం ప్రాంతంలోని క్రింది ప్రధాన తపాలాకార్యాలయాలలో కొనుక్కోవచ్చు. ఈ హెడ్ పోస్టాఫీసులు చందాలను కూడా స్వీకరిస్తాయి.

హెడ్ పోస్టాఫీసుల జాబితా:

| | | |
|---|---|---|
| ఆముదాలవలస | మండపేట | సామర్లకోట |
| అమలాపురం | నర్సీపట్నం | శ్రీకాకుళం |
| అనకాపల్లి | పార్వతీపురం | టెక్కలి |
| బొబ్బిలి | రాజమండ్రి | విశాఖపట్నం |
| చోడవరం | రామచంద్రాపురం | విజయనగరం |
| కాకినాడ | రాజోలు | వాల్తేరు |

మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, సంస్కృతం, అస్సామీ, సంథాలీ, కన్నడం, తమిళం, మలయాళం భాషల చందమామకు చందాలు చెల్లించడానికి ఆసక్తికలవారు వివరాలకు సమీప పోస్టాఫీసులను సంప్రదించండి.



ఉగాది
ప్రత్యేక తగ్గింపును వినియోగించుకోండి. వివరాలకు పైన కనబరచిన పోస్టాఫీసుల్లో ఒక దానిని సంప్రదించండి!




సంవత్సర చందాలు :
ఇంగ్లీష్ రూ. 180లు;
ఇతర భాషలు రూ. 150లు;
జూనియర్ చందమామ రూ. 150లు.

విడిప్రతి :
ఇంగ్లీష్ : రూ. 15లు; తెలుగు, హిందీ, ఒరియా రూ. 13లు;
జూనియర్ చందమామ : రూ. 15లు.






చందమామ సంపుటి: 60 మార్చ్ 2007 3 సంచిక: 3

## ఈ సంచికలో...



## ఈ నెల విశేషాలు












**SUBSCRIPTION**

For USA and Canada
Single copy $2
Annual subscription $20

*Remittances in favour of Chandmama India Ltd.*
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal,
Chennai - 600 032
E-mail :
subscription@chandamama.org





చందా

ఎయిర్‌మెయిల్ ద్వారా అన్నిదేశాలకు పన్నెండు సంచికలు రూ: 900

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. 150.00

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.






Statement about Ownership of
**CHANDAMAMA (Telugu)**
Rule 8 (FormVI), Newspaper (Central) Rules, 1956

1. **Place of Publication**
   82 Defence Officers Colony
   Ekkatuthangal, Chennai-600 032
2. **Periodicity of Publication**
   MONTHLY
   1st of each calendar month
3. **Printer's Name**
   B. VISWANATHA REDDI
   **Nationality**
   INDIAN
   **Address**
   82 Defence Officers Colony
   Ekkatuthangal, Chennai-600 032
4. **Publisher's Name**
   B. VISWANATHA REDDI
   **Nationality**
   INDIAN
   **Address**
   82 Defence Officers Colony
   Ekkatuthangal, Chennai-600 032
5. **Editor's Name**
   B. VISWANATHA REDDI
   (Viswam)
   **Nationality**
   INDIAN
   **Address**
   82 Defence Officers Colony
   Ekkatuthangal, Chennai-600 032
6. Name and Address of individuals who own the newspaper
   **Chandamama India Ltd.**
   Board of Directors:
   1. P. Sudhir Rao
   2. Vinod Sethi
   3. B. Viswanatha Reddi
   82 Defence Officers Colony
   Ekkatuthangal, Chennai-600 032

*I,* **B. Viswanatha Reddi,** *do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.*

**(Sd.) B. VISWANATHA REDDI**
*Publisher*

1st March 2007



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# మన ప్రధాన బాధ్యత

మన పార్లమెంటులో అల్పసంఖ్యాకులకు మత, ఆర్థిక, సామాజిక స్థితులను బట్టి రాయితీలు కల్పిస్తూ చట్టం తీసుకురావాలని తరచూ మాట్లాడడం జరుగుతోంది. స్వేచ్ఛ, సమానత్వం, సహోదరత్వం పునాదులుగా రూపొందించబడింది భారతీయ రాజ్యాంగం. అలాంటప్పుడు ప్రజలలోని కొన్ని వర్గాలకు మాత్రం ప్రత్యేక సదుపాయాలు కల్పించ వలసిన అవసరం ఏమిటి? అలా చేయడం ద్వారా ప్రాథమిక రాజ్యాంగ సూత్రాన్నే గాలికి వదిలినట్టు కాదా?

పాఠశాలలలో విద్యార్థులు హెచ్చుతగ్గులు పాటించకుండా, పక్క పక్కనే కూర్చుని ఎలాంటి అరమరికలు లేకుండా హాయిగా చదువుకుంటున్నారు. వారి దృష్టి అంతా చదువుల మీదే ఉంటోంది. మంచి మార్కులతో ఉత్తీర్ణులు కావాలి; ఆటపాటలలో ఒకరిని మించి ఒకరు రావాలన్నదే వారి లక్ష్యంగా ఉంటోంది.

పెద్దలు కూడా ఈ విషయంలో పిల్లలను ఆదర్శంగా తీసుకుని దేశ సంపదల అభివృద్ధి కోసమే తమ దృష్టిని కేంద్రీకరించడం ఉత్తమం. అదే వారి ప్రధాన కర్తవ్యం కావాలి. ఎందుకంటే మన దేశం ఎదుర్కొంటూన్న అసలు సమస్య పేదరికం!

ఈ సందర్భంగా పూజ్య బాపూజీ మాటలను ఒకసారి స్మరించుకుందాం: ''ప్రజలలో ఉన్నత వర్గం, తక్కువ వర్గం అంటూ లేని, అన్ని కులాల వాళ్ళూ ఐకమత్యంతో, పరిపూర్ణ సమన్వయంతో జీవించే భారతదేశం కోసం నేను పాటుపడతాను.''

మనపిల్లలు ఇలాంటిసానుకూల వైఖరిని అలవరచుకోగలరని చందమామ దృఢంగా విశ్వసిస్తోంది!

సంపాదకుడు : **విశ్వం**



# పాఠకుల లేఖలు

వీధిబడికి వెళ్ళేముందు ఆవకాయముక్కతో అమ్మ పెట్టిన పెరుగన్నం, పాతాళ భైరవి సినిమా, చందమామ పుస్తకం-ఇవీ నా బాల్యం తాలూకు మధుర స్మృతులలో కొన్ని. హృదయపొరల్లో నిక్షిప్తమై ఉండి, ఈనాటికీ తొంగిచూస్తున్న అమూల్య జ్ఞాపకాలు. టీ.వీ. ప్రభంజనానికి పబ్లిషింగ్ హౌసులు కొట్టుకొని పోయినా 60 సంవత్సరాలుగా చందమామ ప్రకాశించగలుగుతున్నదంటే దానికి కారణం అది ''ఆకాశంలో చందమామ'' కావటమే. చందమామ మన సాంస్కృతిక సంపదలో ఒక భాగం. ఇది నిజం. దయచేసి అపూర్వసౌధం, విచిత్ర కవలలు, నావికుడు సింద్‌బాద్ మొదలగు సీరియళ్ళను మళ్ళీ ప్రచురించండి. కథలకు పూర్తి పేజీ చిత్రాలు, నిలువు చిత్రాలను పునరుద్ధరించండి. చందమామకు జీవం దాని జానపద, పౌరాణిక రూపమే. దయచేసి ఈ మూలరూపంలో ఎలాంటి మార్పులూ తలపెట్టకండి. ఆఖరుగా పింగళిగారి మాటలు అరువు తీసుకుని చెబుతున్నాను: ''చంద్రకాంతి ప్రసరించినంత నేల చందమామ చదవబడాలి. చంద్రుడు నిలిచి ఉన్నంత కాలం చందమామ నిలిచి ఉండాలి.''

– కె. శివకుమార్, ఒంగోలు – **523 002**(ఆం.ప్ర)

**1948** నుంచి మా తల్లిదండ్రులు చందమామ పాఠకులు. నేను 1977 నుంచి చందమామ చదువుతున్నాను. మా ఇంటిల్లిపాదికీ చందమామ జీవితంలో ఒక భాగం. మన సంస్కృతి, సంప్రదాయాలు కనుమరుగవుతూన్న ఈ తరుణంలో చందమామను నేటి యువతరంతో చదివించడం మన బాధ్యత.

–నందకిశోర్, దేవరకొండ, నల్గొండ జిల్లా(ఆం.ప్ర)



ఆరు దశాబ్దాల సాహిత్యంతో చందమామ ఇంకా మురిపిస్తూనే ఉంది. మాగిన కొద్దీ మధురంగా ఉంటూన్న పాతిక సం.ల నాటి కథలు, వినోదం, విజ్ఞానం కలగలిపిన కథలు చందమామ ప్రత్యేకతలు. తొలి రోజుల్లో ప్రచురించిన పంచతంత్ర కథలు, పౌరాణిక, జానపద ధారావాహికల్లోని పూర్తి పేజీ చిత్రాలు అలాగే ప్రచురించండి. సంపాదకీయాల్లో పత్రికకు సంబంధించిన కబుర్లు తెలియజేయండి. 'విచిత్ర కవలలు' వంటి అద్భుత సీరియల్స్ మళ్ళీ చందమామను అలంకరించేలా చూడండి.

అల ఆకాశపు చందమామలా ఇలలో ఈ చందమామ కథా వెన్నెలలు మరింతగా కురిపించాలని ఆకాంక్షిస్తున్నాను.

–ఆర్. వి. రాఘవరావు, అద్దంకి (ఆం.ప్ర)



# రెక్కలదేవత!

కన్నయ్యకు పన్నెండేళ్ళ వయసులో విష జ్వరం వచ్చి హఠాత్తుగా తల్లి పోయింది. వాడికి తల్లి అంటే పంచప్రాణాలు. తండ్రి జంగయ్య ఎంతో ప్రేమగా చూసుకుంటున్నా, ''నాన్నా, అమ్మ కావాలి,'' అంటూ తరచూ కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడు. తల్లిపోయి యేడాది అయినా ఇంకా నిద్రలో తల్లిని కలవరించేవాడు.

అది చూసి జంగయ్య బంధువులు, ''నీకు పెళ్ళాం అవసరం లేకపోయినా, కన్నయ్య ఆలనాపాలనా చూసుకోవడానికి తప్పక అమ్మకావాలి. మా మాట విని మళ్ళీ పెళ్ళి చేసుకో,'' అని జంగయ్యకు చెప్ప సాగారు.

దానికితోడు వరుసకరువులతో విసిగిపోయిన జంగయ్య, పల్లెలో ఉన్న కొద్దిపాటి పొలం అమ్మేసి, ఆ డబ్బుతో దాపులనున్న పట్నంలో చిన్న కిరాణా దుకాణం తెరిచాడు. అయితే, పట్నంలో అద్దెలు ఎక్కువ గనక, కాపురం మాత్రం పల్లె నుంచి మార్చలేదు. జంగయ్య చీకటితో వంట చేసి పట్నం వెళ్ళి, రాత్రి పొద్దు పోయి తిరిగి వచ్చాక మళ్ళీ వంట చేసేవాడు. బడి నుంచి సాయంత్రం తిరిగి వచ్చే కన్నయ్య, తండ్రి వచ్చేంతవరకు ఎదురు చూపులు చూస్తూ ఒక్కడే బిక్కు బిక్కుమంటూ ఇంట్లో ఉండవలసి వచ్చేది.

ఇవన్నీ చూసి జంగయ్య తనకు ఇష్టం లేకపోయినా దూరపు బంధువైన జగదీశ్వ రిని పెళ్ళి చేసుకున్నాడు. జగదీశ్వరి కాపు రానికి వచ్చిన రోజే, ''మా కన్నయ్య కోసమే నిన్ను చేసుకున్నాను. తల్లి లేని వాణ్ణి నీ కన్నబిడ్డలా జాగ్రత్తగా చూసుకోవాలి,'' అన్నాడు జంగయ్య.

''ఆమాత్రం నాకూ తెలుసు,'' అంటూ నవ్వింది జగదీశ్వరి.

అయితే, జగదీశ్వరి ఆ ఇంట అడుగుపెట్టి మూడు నెలలు ముగియక ముందే కన్నయ్య కష్టాలు ఆరంభమయ్యాయి.

మాచిరాజు కామేశ్వరరావు



జంగయ్య పట్నంలో దుకాణం మూసే సరికి బాగా పొద్దుపోయి రాత్రయ్యేది. మళ్ళీ తెల్లవారగానే దుకాణం తెరవవలసిన పరిస్థితి ఏర్పడింది. జంగయ్య ఇంటికి వారానికి ఒక్క రోజు మాత్రమే వచ్చేవాడు.

దాంతో అడిగేవాళ్ళు లేకుండా పోయిన జగదీశ్వరి కన్నయ్య చేత ఇంటెడు పనీ చేయించేది. స్వతహాగా నెమ్మదస్థుడైన జంగయ్య, కొడుకు ఏం చెప్పినా భార్యను పల్లెత్తు మాట అనేవాడు కాదు. అందువల్ల ఏడాది తిరగకుండా ఆ ఇంట్లో జగదీశ్వరి ఆడింది ఆట, పాడింది పాటగా తయారయ్యింది.

ఒక రోజు ఉదయం బడికి బయలుదేరుతూన్న కన్నయ్య చేతిలోని పుస్తకాలు విసురుగా లాక్కుని, ''నువ్వు చదువుకుని ఊరిని ఉద్ధరించేది ఏమీలేదు. నీ తిండికే బోలెడు ఖర్చవుతోంది. నువ్వు ఈ రోజు నుంచి బడి మాని అడవికి వెళ్ళి, ఎండు పుల్లలు ఏరుకురా. వంటచెరకు ఖర్చయినా తప్పుతుంది,'' అన్నది జగదీశ్వరి.

కన్నయ్యకు చదువంటే ప్రాణం. సవతి తల్లి బడిమానమనగానే వాడికి ఏడుపు వచ్చేసింది, ''నా చేత చదువు మానిపించవద్దు పిన్నీ. సాయంత్రం బడి నుంచి వచ్చాక కావలసినన్ని పుల్లలు తెస్తాను,'' అన్నాడు ఏడుపు గొంతుతో.

''సాయంత్రం చేయడానికి వేరే పనులున్నాయి, నడు, నడు,'' అంటూ జగదీశ్వరి కన్నయ్యను అడవికి పంపింది.

కన్నయ్య నదిగట్టునే నడిచి వెళ్ళి మధ్యాన్నానికి అడవి చేరాడు. వాడక్కడ ఎండు పుల్లలు ఏరి, మోపుగా కట్టి నెత్తిన పెట్టుకుని ఇల్లు చేరేసరికి చీకటిపడింది.

''ఈ నాలుగు పుల్లలు ఏరుకురావడానికి ఇంతసేపా?'' అంటూ విరుచుకు పడింది జగదీశ్వరి.

ఆ రోజు మొదలు ఇంటి పనితో పాటు, అడవికి వెళ్ళి పుల్లలు తేవడం కన్నయ్యకు తప్పడం లేదు. శరీర కష్టం కన్నా, చదువు మానవలసి వచ్చినందుకు మనసులో బాధపడసాగాడు.

ఒకనాడు అడవిలో ఎండుపుల్లలు ఏరుతూన్న కన్నయ్యకు, రేగుపొదల మధ్య బంగారు రంగుతో మెరుస్తూన్న ఈక ఒకటి కనిపించింది. ఆ ఈకను జంగయ్య అతి ప్రయత్నం మీద జాగ్రత్తగా బయటకు తీశాడు. అది బంగారు రంగుతో ధగధగా మెరిసిపోవడమే

గాక, సువాసనలు కూడా వెదజల్లుతోంది. కన్నయ్య ఆశ్చర్యంతో ఆ ఈకను అటూ ఇటూ తిప్పి చూస్తూండగా, కళ్ళ ముందు ఒక మెరుపు మెరిసినట్టయి, ఒక దేవతాస్త్రీ ప్రత్యక్ష మయింది. ఆ దేవతకు అందమైన రెక్కలు న్నాయి. అవి బంగారు రంగుతో మిలమిలా మెరిసిపోతున్నాయి.

''చిన్న వయసులో కష్టపడుతూన్న నిన్ను చూస్తూంటే జాలి కలుగుతోంది,'' అన్నది రెక్కలదేవత.

''మా నాన్న సంపాదన తిండికే చాలక నేను ఇలా కష్టపడవలసి ఉంది. అయితే, నా బాధ మాత్రం చదువు మానేసినందుకే. నా మీద అంత జాలిగా ఉంటే, మరి ఇన్నాళ్ళూ నాకు కనిపించలేదేం?'' అని అడిగాడు ఆశ్చ ర్యంగా కన్నయ్య.

''ఈ అడవిలో నా ఈక ఎవరి దగ్గర ఉంటే వారికే కనిపిస్తాను. ఇతరులకు కనిపించను. నేను నీకు సాయపడాలనుకుంటున్నాను. నీ చేతిలోని ఈకతో నా రెక్కలను మూడుసార్లు తాకావంటే బంగారు నాణాలు రాలుతాయి. వాటితో మీదరిద్రం తీరిపోతుంది నీకీ కష్టాలు తప్పుతాయి. నువ్వెళ్ళి హాయిగా చదువుకో వచ్చు,'' అన్నది దేవత.

ఆ మాటకు కన్నయ్య నవ్వి, ''కష్టపడ కుండా సంపాదించిన డబ్బుతో తృప్తిగా బత కలేం అని బడిలో మా గురువుగారు చెబు తూండేవారు. నీ బంగారు నాణాలు నాకు వద్దు,'' అన్నాడు.

కన్నయ్య మాటలకు ముచ్చటపడిన దేవత, ''అయితే, నువ్వు పుల్లలు ఏరేదాకా నీతో



కబుర్లు చెబుతాను. నీకు కష్టం తెలియదు,'' అన్నది. దేవత చెప్పే మంచి మాటలు వింటూ, ఆమె రెక్కలు విసురుతూ ఉంటే వచ్చే సుగంధ భరితమైన చల్లటి గాలులతో సేదతీరుతూ, సునాయాసంగా కట్టెల మోపు సిద్ధంచేశాడు కన్నయ్య.

''నా వీపు మీద కూర్చో. నిన్ను మీ ఇంటి దగ్గర దింపుతాను. ఆ ఈకను ఎవరి కంటా బడకుండా భద్రంగా దాచుకో. అది పోగొట్టు కుంటే నేను నీకు కనిపించను,'' అంటూ దేవత అందమైన పెద్ద పక్షిగా మారిపోయింది. ఆ తరవాత కన్నయ్యను వీపు మీద కూర్చో బెట్టుకుని, ఆకాశంలో ఎగురుతూ వచ్చి వాళ్ళ ఇంటి పెరట్లో దింపి వెళ్ళిపోయింది.

రాత్రి వంటకు బియ్యం సిద్ధంచేస్తూన్న జగదీశ్వరి, ''ఈ రోజు చాలా పెందలాడే తిరిగి



వచ్చావు. అయినా పెరటి దోవన వచ్చావే మిటి?'' అని అడిగింది అనుమానంగా.

''పెరటిదోవన అడవికి అడ్డుదారి ఉందిలే,'' అంటూ కాళ్ళు చేతులు కడుక్కోవడానికి వెళ్ళాడు కన్నయ్య.

అది మొదలు కన్నయ్య దేవత ఈకను పగలు భద్రంగా తన దుస్తుల్లో దాచుకునే వాడు. రాత్రుల్లో తలకింది దిండులో రహ స్యంగా దాచేవాడు. అడివికి వెళ్ళగానే ఈకను తీసి చేతిలో పట్టుకోగానే దేవత ప్రత్యక్షం అయ్యేది. దేవత కబుర్లు వింటూ కష్టం తెలియకుండా పుల్లలు ఏరుకునే వాడు. దేవత రోజూవాణ్ణి ఇంటి వద్ద దిగవిడిచి వెళ్ళేది.

ఆరోజు కన్నయ్య పొరబాటున దిండు కింద దాచిన ఈకను తీసుకోవడం మరిచి పోయి అడవిలోకి వెళ్ళిపోయాడు.

పక్కలు సరిచేస్తూన్న జగదీశ్వరికి, కన్నయ్య దిండు కింద బంగారు రంగులో సుగంధాలు వెదజల్లుతూన్న ఈక కనిపించింది. ఆ ఈకను చూడగానే జగదీశ్వరి కళ్ళు చెదిరిపోయాయి. ఆ ఈకను అప్పటికప్పుడే ఊళ్ళో వున్న స్వర్ణ కారుడి వద్దకు తీసుకువెళ్ళింది.

దాన్ని పరిశీలించి చూసిన స్వర్ణకారుడు, ''ఇదంతా మేలిమి బంగారం. దీనిని నాకు ఇస్తే వెయ్యి వరహాలు ఇస్తాను,'' అన్నాడు.

''దీనిని అమ్మాలనుకుంటే నీ దగ్గరికే వస్తానులే!'' అన్నది జగదీశ్వరి.

ఆమె ఇంటికి వచ్చి తియ్యటి సున్ని వుండలు తయారు చేసింది. సాయంత్రం కన్నయ్య రాగానే, ''ఇంటి కోసం ఎంత కష్ట పడుతున్నాడు నా తండ్రి, '' అంటూ చెంగుతో వాడి మొహంమీది చెమట తుడిచి, కొసరి కొసరి సున్నివుండలు తినిపించింది.

జగదీశ్వరి కనబరుస్తున్న ఆప్యాయతకు కన్న తల్లి గుర్తుకు వచ్చి కళ్ళనీళ్ళు తిరిగాయి కన్నయ్యకు. ఇదే సమయమని జగదీశ్వరి బంగారు ఈకను చూపించి, ''ఈ ఈక నీ దిండు కిందికి ఎలా వచ్చింది? తల్లిలాంటి దాన్ని. నా దగ్గర దాపరికం దేనికి? దీనిని నీకు ఎవరు ఇచ్చారో చెప్పు,'' అని అడిగింది.

కన్నయ్య రెక్కల దేవత గురించి అంతా జగదీశ్వరికి చెప్పి, ''అడవిలోకి వెళ్ళి, ఈ ఈకను చేతిలో పట్టుకుంటే దేవత ప్రత్యక్ష మవుతుంది,'' అన్నాడు.

మరునాడు ఉదయం జగదీశ్వరి, ''కన్నయ్యా, నీకు చదువు అంటే ప్రాణం కదా. పాపిష్టిదాన్ని మధ్యలోనే చదువు ఆపిం

చాను. ఈ రోజునుంచి నా కష్టాలేవో నేను పడతాను. నువ్వు బడికి వెళ్ళు,'' అన్నది.

కన్నయ్య పుస్తకాలు తీసుకుని సంతోషంగా బడికి వెళ్ళాడు.

వాడు అటు వెళ్ళగానే జగదీశ్వరి దేవత ఈకను కొంగు చాటున దాచుకుని ఒక గొడ్డలి తీసుకుని అడవికి బయలుదేరింది.

అడవిలోపలికి వెళ్ళి, ఈకను ఎడమ చేత్తో పట్టుకుని, కుడిచేతిలోని గొడ్డలితో పక్కనున్న చెట్టును నరుకుతూన్నట్టు నటించసాగింది. అంతలో, ''ఆగు. అదేంపని? పచ్చని చెట్టును నరకడం మహాపాపం!'' అంటూ రెక్కల దేవత ప్రత్యక్షమయింది.

''ఏం చేయమంటావు తల్లీ. మా కన్నయ్య తెచ్చే నాలుగు పుల్లలతో మా దరిద్రం తీరేదేనా?'' అంటూ విచారంతో చేతులు తిప్పింది జగదీశ్వరి.

''కన్నయ్యను కష్టపెట్టకుండా చదువుకోనిస్తే నీకు సాయంచేస్తాను. చదువులేకపోతే మనిషికీ, ఈ అడవిలోని మాసుకూ తేడా ఏమీ లేదు,'' అన్నది దేవత.

''తప్పక చదివిస్తాను తల్లీ. ఆ చేసే సాయమేదో తొందరగా చెయ్యి,'' అన్నది జగదీశ్వరి.

''నీ చేతిలోని నా ఈకతో నా రెక్కల మీద మూడుసార్లు తాకావంటే బంగారు నాణాలు రాలుతాయి,'' అన్నది దేవత.

వెంటనే జగదీశ్వరి ఈకను దేవత రెక్కల మీద మూడుసార్లు తాకించింది. రెక్కల నుంచి కొన్ని బంగారు నాణాలు రాలాయి. వాటిని చూసి అబ్బురపడిన జగదీశ్వరి మళ్ళీ ఈకతో



దేవత రెక్కలను తాకించబోయింది. ''రోజుకు ఒక్కసారి మాత్రమే నాణాలు రాలుతాయి,'' అంటూ దేవత అదృశ్యమయింది.

ఆ నాణాలతో ఇంటికి వచ్చిన జగదీశ్వరికి రాత్రంతా నిద్ర పట్టలేదు. అప్పటికప్పుడే అందరికన్నా ధనవంతురాలు కావాలని ఆత్రంతో ఆలోచించింది. మరునాడు తెల్లవారగానే గొడ్డలిని భుజానవేసుకుని అడవికి వెళ్ళి, ఈకను తీసి పట్టుకున్నది.

''మళ్ళీ వచ్చావెందుకు?'' అంటూ దేవత ప్రత్యక్షమయింది.

''నువ్వు నిన్న ఇచ్చిన నాణాలు పాత బాకీలు తీర్చడానికే సరిపోయాయి. ఇక కన్నయ్యను ఎలా చదివించను చెప్పు?'' అన్నది జగదీశ్వరి విచారంగా.

''దిగులు పడకు. ఈకను నా రెక్కలకు తాకించు,'' అన్నది దేవత.

జగదీశ్వరి అలా చేయడంతో రెక్కల నుంచి జలజలా బంగారు నాణాలు రాలాయి. వాటినంతా మూట కట్టుకున్న జగదీశ్వరి, ''ఈ ఎండలో నడవలేను. ఇంటి దగ్గర దింపు తల్లీ,'' అన్నది దేవతతో.

పెద్ద పక్షి రూపమెత్తిన దేవత జగదీశ్వరిని తన వీపున కూర్చోబెట్టుకుని బంగారు రెక్కలల్లారుస్తూ ఆకాశ మార్గాన బయలుదేరింది. అవకాశం కోసం చూస్తూన్న జగదీశ్వరి, తన చేతిలోని గొడ్డలితో దేవత బంగారు రెక్కలను తెగ నరకాలని ప్రయత్నించి, అదుపు తప్పి, అంతపై నుంచి కింది అగాథంలోకి పడిపోయింది. ఆమె చెంగులోని ఈక గాలికి ఎటో ఎగిరిపోయింది. ఆ తరవాత ఆమె ఏమైపోయిందో ఎవరికీ తెలియలేదు!

భార్య కోసం పది రోజులు వెతికిన జంగయ్య, ఆమె జాడ కనిపించక పోయేసరికి, ఇక పల్లెలో ఉండలేక వచ్చిన ధరకు ఇల్లు కూడా అమ్మేసి పట్నానికి మకాం మార్చేశాడు.

పట్నంలోని పెద్ద బడిలో చదువుకునే కన్నయ్యకు తరచూ రెక్కల దేవత గుర్తుకు వచ్చేది. ఆ సంగతి చెబితే, ''అంతా నీ భ్రమ! పోనీలే. ఆ దేవత ఎన్నో మంచి మాటలు చెప్పిందన్నావు కదా. వాటిని ఆచరిస్తూ, బాగా చదువుకుని జీవితంలో పైకిరా,'' అనేవాడు జంగయ్య నవ్వుతూ.






# రాకాసిలోయ

## 19

[కేశవుణ్ణీ, జయమల్లునూ బానిసలుగా కొన్న వర్తకులపై హఠాత్తుగా నరమాంస భక్షకులు వచ్చి పడ్డారు. ఆ గందరగోళంలో కేశవుడూ, జయమల్లూ పైనుంచి కింద ప్రవహిస్తూన్న నదిలోకి దూకి ఒక లంక చేరారు. అక్కడ వున్న కొన్ని గుడిశెలను వాళ్ళు సమీపిస్తూండగా, ఒక గుడిశెలోంచి, 'జ్యేష్టుడెక్కడ? కనిష్టుడెక్కడ?' అని ప్రశ్నించుతున్న కంఠధ్వని వినిపించింది. తరవాత-]

కేశవుడికీ, జయమల్లుకూ ఓ తృటికాలం ఏం చేసేందుకూ పాలుపోలేదు. ''ఆ కంఠధ్వని బ్రహ్మదండి మాంత్రికుడిది! నా తండ్రిని వాడు హింసిస్తున్నాడు,'' అనుకున్నాడు కేశవుడు. ''ఆ ప్రశ్నించే గొంతు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడిది! గుడిశెలో వాడి అనుచరులు ఎంత మంది వున్నారో తెలియదు. ఇప్పుడేమిటి కర్తవ్యం?'' అనుకున్నాడు జయమల్లు. ఇలా ఆలోచిస్తూ కేశవుడూ, జయమల్లూ అప్పుడే చలనం వచ్చిన వాళ్ళలా చప్పున ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. మాటలూ, సౌంజ్ఞలూ లేకుండానే ఆ క్షణంలో చేయవలసిందేమిటో ఇద్దరికీ తెలిసిపోయింది.

జయమల్లు నిశ్శబ్దంగా వంగి, గుడిశె పక్కన వున్న ఒక ఈటెను జాగ్రత్తగా చేతిలోకి తీసుకున్నాడు. తరవాత కేశవుడి భుజం మీద చేయివేసి చెవిలో మెల్లిగా, ''గుడిశెలో వున్న శత్రువు లెందరో ముందు తెలుసుకోవాలి,'' అంటూ గుడిశెకు అల్లివున్న కొబ్బరి ఆకులలో నుంచి ఈటెను నింపాదిగా లోపలికి గుచ్చాడు.



కేశవుడు, జయమల్లు చేసిన కంతలో నుంచి లోపలికి తొంగి చూశాడు. గుడిశె అంతా చీకటి మయంగా వున్నది. ఒక మూల వెలుగుతున్న కాగడా వెలుగులో మసకమసకగా ఇద్దరు ముగ్గురు మనుషులు కనిపిస్తున్నారు. వాళ్ళల్లో ఒకడు మెడలో మానవ కంకాళాలను పూసలుగా ధరించి వున్నాడు. మరొకడు కూడా చూడడానికి దాదాపు అలాగే వున్నాడు. అయితే, వాడికి మెడలో ఎలాంటి అలంకారాలూ లేవు. వాళ్ళకు ఒకపక్కగా ఒక యువకుడు పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నాడు. అతణ్ణి కంకాళాలు ధరించి వున్నవాడు ప్రశ్నిస్తున్నాడు.

''నాకు సర్వం తెలుసు, అంతా తెలుసు! నా నుంచి నువ్వు ప్రాణాలతో పారిపోలేవు. ముసలివాడి గొడవ నా కవసరం లేదు. నాక్కావలసింది, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ. చెప్పు, ఊ, వాళ్ళెక్కడ?'' అని కంకాళాలు ధరించిన వాడు భీకరంగా అరిచాడు.

అంత ప్రమాద పరిస్థితిలోకూడా కేశవుడికి ఎంతో ఆనందం కలిగింది. ఈ దుర్మార్గులెవరో గాని, వాళ్ళకు చిక్కినవాడు మాత్రం తన తండ్రి కాదు. పైగా, గుడిశెలో వున్నవాళ్ళిద్దరే; వాళ్ళను హతమార్చి, వాళ్ళకు బందీ అయినవాణ్ణి విడిపించటం అంత పెద్దసమస్య కాదు.

కేశవుడు ఇలా అనుకుని, జయమల్లుకేసి తిరిగి, ''మల్లూ, మనం లోపలికి జొరబడదాం. శత్రువులిద్దరే,'' అన్నాడు.

జయమల్లు తొందర పడవద్దని కేశవుణ్ణి వారించి, కంతలో నుంచి గుడిశెలోకి చూశాడు. చేతులు విరిచి కట్టబడిన వ్యక్తి, కోయనాయకుడు గడేజంగ్ అనుచరుడన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో బంధితుణ్ణి ప్రశ్నిస్తున్నవాడు లేచి నిలబడి, పళ్ళు కొరుకుతూ, ''వీడిని ఎంత హింసించినా నిజం చెప్పడు. ఆ మండూక కషాయం తాగించు. నిజం అదే బయటపడుతుంది,'' అన్నాడు.

''అలాగే చేస్తాను, చండమండూకేశ్వరా,'' అంటూ మండూకుడి అనుచరుడు లేచి వెళ్ళి, గుడిశెలో ఒక మూల నుంచి ఒక పాత్ర తెచ్చి, దానిని అక్కడ వున్న మిడిగుడ్ల కొయ్య బొమ్మల ముందు మూడుసార్లు తిప్పి, పాత్రను బంధితుడి నోటిముందు పెడుతూ, ''ఇది నిజం చెప్పించే కషాయం, తాగు,'' అంటూ అతడి నోటిలో బలవంతంగా పోశాడు.

''వీడు నరభక్షకుల నాయకుడైన చండమండూకుడు, తెలిసిందా? వాడిప్పుడు బంధి

తుడికి నిజం పలికించే కషాయమేదో ఇప్పించాడు. తొందర ఎందుకు? ఏం జరుగుతుందో చూద్దాం. ఆ తరవాత వాణ్ణీ, వాడి సేవకుణ్ణీ యమపురికి పంపుదాం,'' అన్నాడు జయమల్లు.

ఇంతలో మండూక కషాయం తాగినవాడు, పెద్దగా రెండుసార్లు దగ్గి, ఒకటి రెండుసార్లు మత్తెక్కినవాడిలా అటూ ఇటూ ఊగిసలాడి, ''వాళ్ళిద్దరూ.. జ్యేష్ఠుడూ... కనిష్ఠుడూ... వున్నారు... ఇక్కడే...''

అతడు మాట ముగించే లోపలే జయమల్లు కంత దగ్గిర నుంచి ఇవతలికి ఎగిరి గంతేసి, ''కేశవా, ప్రమాదం! అది నిజంగా సత్యం చెప్పించే కషాయమే! ఆ తాగినవాడు మనం ఇక్కడ వున్నట్టు చెప్పేస్తున్నాడు. మనం వెంటనే గుడిశెలో జొరబడి ఆ దుర్మార్గుల్ని చంపటం తప్ప మరి మార్గం లేదు,'' అంటూ గుడిశె ద్వారానికేసి పరిగెత్తాడు. బయట అడుగుల చప్పుడు వింటూనే చండమండూకుడు అదిరిపడ్డాడు. ''ఎవరో శత్రువులు, శత్రువులు!'' అంటూ అరిచాడు. అతడి అనుచరుడు ఒక ఈటె తీసుకుని ద్వారంకేసి పరిగెత్తుతూ, ''మండూకేశ్వరా, మీరు మాయం కండి,'' అని కేకపెట్టాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిశె ద్వారానికి అడ్డంగా వున్న తడికెను ఒక్క తన్ను తన్ని లోపలకు దూకారు. వాళ్ళను ఎదిరించ చూసిన, మండూకుడి అనుచరుణ్ణి కేశవుడు తన కత్తిపిడితో తల మీద ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బకు వాడు అబ్బా అంటూ కింద పడిపోయాడు.



గుడెశెలోకి ప్రవేశించిన కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. చేతులు విరిచికట్టబడి వున్నవాడు, జయమల్లు ఊహించినట్టు గడేజంగ్ అనుచరుడే. కాని, చండమండూకుడి జాడలేదు.

జయమల్లు, గడేజంగ్ అనుచరుడి కట్లు విప్పి అతణ్ణి గుడిశెలో వున్న ఒక బాదుకు ఆనించి కూచోబెట్టాడు. అతడింకా మత్తుతో అటూ ఇటూ వూగుతున్నాడు. జయమల్లు అతడి తల మీద ఇంత నీరు కుమ్మరించి, భుజాలు పట్టుకుని వూపుతూ, ''నువ్వు గడేజంగ్ అనుచరుడివే గదా? మేమిద్దరం నీ స్నేహితులం. మనమంతా జలపాతంలో నుంచి నదిలోకి దూకి కపిలపుర రాజ్యం చేరాం. అక్కడ బానిస వర్తకుడి భటులకు చిక్కకుండా నువ్వూ, నీతోటివాడూ, గురు మౌనానందుడూ ఎటో పారిపోయారు. తర




వాత ఏం జరిగింది?'' అని గుక్క తిప్పుకో కుండా ప్రశ్నల వర్షం కురిపించాడు.

జయమల్లు ప్రశ్నకు కోయయువకుడు కళ్ళు తెరిచి అతడి కేసీ, కేశవుడి కేసీ చూడటం మాత్రం చేయగలిగాడు. అతడి ముఖంలో ఆశ్చర్యం, ఆనందం తొణికిసలాడాయి. ఏదో చెప్పేందుకు ప్రయత్నించాడు, కాని మాటలు తడబడినై.

''మల్లూ, అతణ్ణి తొందరపెట్టకు. కాస్త విశ్రాంతి తీసుకోనీ. ఈ లోపల మనం ఈ చండమండూకుడి జాడ తెలుసుకుందాం,'' అన్నాడు కేశవుడు.

కేశవుడిలా అనగానే మండూకుడి అనుచ రుడు లేచి కూచుంటూ, ''హా, చండమండూ కేశ్వరా! మాయమయ్యావా? తిరిగీ నీ దర్శనం నూరేళ్ళ తరవాతనే గదా? అంత కాలం నువ్వు లేకుండా, నీ అనుచరులమైన మేము ఎలా జీవించటం!'' అంటూ నెత్తీ నోరూ కొట్టుకో సాగాడు.

వాడి దుఃఖం, నూరేళ్ళ తరవాతనే గదా నీ దర్శనం అన్న మాటలూ విని కేశవుడికి చాలా ఆశ్చర్యం కలిగింది.

కాని, జయమల్లు చిరునవ్వు నవ్వుతూ, మండూకుడి అనుచరుణ్ణి సమీపించి, వాడి జుట్టు పట్టుకుని కుదుపుతూ, ''ఓరి దొంగ వెధవా, నీ మాటలు మేము నమ్ముతామే అను కున్నావా! ఎక్కడ? నీ నాయకుడెక్కడ? నిజం చెప్పక పోయావో నీ ప్రాణం తీస్తాను,'' అన్నాడు.

''ప్రాణమా? తీస్తావా? అంతకంటె నాక్కా వలసిం దేమిటి? చండమండూకేశ్వరుడి కోసం చచ్చినవాళ్ళు నేరుగా స్వర్గానికే వెళ్ళి పోతారు. ఆ సంగతి లోకంలో తెలియని వాళ్ళె వరూ లేరే. నువ్వెంత అమాయకుడివి. నన్ను త్వరగా చంపెయ్యి!'' అంటూ మండూకుడి అనుచరుడు పక్కన పడి వున్న ఈటెను అందు కుని దాన్ని జయమల్లుకు ఇవ్వబోయాడు.

ఈసారి కేశవుడితో పాటు జయమల్లు కూడా చాలా ఆశ్చర్యం పొందాడు. ఒకవేళ నిజంగానే చండమండూకుడు గుడిశెలో నుంచి మాయమయ్యాడా? అన్న అనుమానం అతడికి కలిగింది. అంతలో గడేజంగ్ అను చరుడు పెద్దగా దగ్గుతూ లేచి నిలబడి, ''జ్యేష్ఠా, కనిష్ఠా, నన్ను గుర్తించారు గదా! సరే. మీరు ఆ దుర్మార్గుడి మాటలు నమ్మకండి. మండూ కుడు ఈ గుడిశెలో వున్న రహస్య మార్గం గుండా పారిపోయి వుంటాడని, నాకు గట్టి నమ్మకం వున్నది,'' అన్నాడు.

''రహస్యము... మార్గము.. అహ్హహ్హా!'' అంటూ మండూకుడి అనుచరుడు గుర్రంలా కొంత సేపు గట్టిగా సకిలించి, ''చండమండూ కేశ్వరుడికి రహస్య మార్గాలు కావాలా? ఆ మహనీయుడు నీటిలో ఉప్పులా కరిగి పోగలడు, గాలిలో పొగలా కలిసిపోగలడు, మట్టిలో సారంలా క్షణాల్లో ఇంకి పోగలడు, ఆకాశంలో...''

''ఇక నోరుముయ్యి వాచాలపు వెధవా!'' అంటూ కోయయువకుడు ఒక్క దూకులో వచ్చి, మండూకుడి అనుచరుడి గొంతు పట్టుకుని, ''చూస్తూంటే వీడి ఎత్తు, తమ నాయకుడు దూరం పారిపోయేందుకు మన చేత ఇక్కడ జాగారం చేయించటంలా వుంది. మీరు గుడిశెలోని నేలంతా ఒకసారి బాగా తొక్కి చూడండి. నేను వీడి కాళ్ళూ చేతులూ కట్టి, నోట్లో గోనెసంచీ కుక్కు తాను,'' అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ గుడిశె అంతా కలయ తొక్కసాగారు. చూస్తూండగానే కోయయువకుడు తన పని ముగించుకుని, థిణక థిణక తై థిణక అంటూ అమిత ఉత్సా హంతో గుడిశెలో హనుమంతుడిలా కుప్పి గంతులు వేయడం ప్రారంభించాడు. రెండు మూడు నిమిషాల కాలం ముగ్గురూ గుడిశె అంతా కలయ తొక్కారు. హఠాత్తుగా కోయ యువకుడు కీచుమంటూ అరిచి, ''రహస్య మార్గం!'' అంటూ దభీమని కింద గోతిలోకి పడిపోయాడు.

కేశవుడూ, జయమల్లూ కోయయువ కుడు పడిపోయిన గోతిలోకి తొంగి చూస్తూ, ''నీకేం దెబ్బలు తగలలేదు గదా? అరెరె,



ఇక్కడ మెట్లుకూడా వున్నవే. ఆహా, మండూకుడు ఇక్కడి నుంచి మాయమైంది, ఈ మెట్ల మీది నుంచి భూసొరంగంలో కన్నమాట!'' అన్నారు.

కోయయువకుడు ఒంటికి పట్టిన మన్ను దులుపుకుని, తల పైకెత్తి, ''ఆ దుర్మార్గుణ్ణి పైనుంచి కిందకు దొర్లించండి. తరవాత మీరు కూడా మెట్లు దిగిరండి. మండూకుడిక్కడే దాక్కుని వుంటాడు.'' అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ కలిసి, మండూకుడి అనుచరుణ్ణి కాళ్ళు, తల పట్టుకుని పైనుంచి గోతిలోకి వున్న మెట్లమీదుగా కిందకు దొర్లించి, తరవాత వాళ్ళు కూడా కిందకు దిగి, గోతిని, దాని అంచుకు వేళ్ళాడుతున్న చెక్కతలుపుతో ఎప్పటిలా మూసేశారు. కోయయువకుడు అనుకున్నట్టు అది వట్టి భూసొరంగం కాదు. అక్కడ విశాలమైన గదులూ, భీకరాకారంతో వున్న కొయ్య బొమ్మలూ, ఈటెలూ, కత్తులూ... ఇలాంటి సరంజామా చాలా వున్నది.

''పైనున్న గుడిశెమండూకుడాడే కపట నాటకంలో ఒక భాగం మాత్రమే. వాడి నిజమైన నివాసగృహం ఇది. ఆ మూలనున్న కాగడాలు వెలిగించి అన్ని గదులూ వెతకండి,'' అన్నాడు జయమల్లు.

ఆ వెంటనే ముగ్గురూ కాగడాలు వెలిగించి, ఆ ప్రదేశమంతా గాలించసాగారు.

కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ భూసొరంగమంతా గాలిస్తుండగా, చండమండూకుడు, తన అనుచరుడొకడితో కలిసి, లంక మధ్య వున్న అడవిలోని ఒక పాడుపడిన బావిలోంచి పైకి వస్తూ, ''ఇప్పటికేదో బతికి బయటపడ్డాం. ఆ బ్రహ్మదండి మాంత్రికపు నీచుడు నన్నెంత మోసం చేశాడు! నన్ను ఎవరి కోసరం అయితే వెతకమన్నాడో, వాళ్ళను నా భవంతి దగ్గిరకే పంపి, నా ప్రాణాలు తీయించేందుకు ప్రయత్నించాడు. లోపల నేను ఆ కోయ కుంకకు మండూక కషాయం తాగించి, నిజం చెప్పిస్తూంటే; ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ గుడిశె కంతల్లో నుంచి ఇదంతా చూస్తున్నారన్న మాట! వాణ్ణి కత్రగ్గుచ్చి, నిలువుగా కాల్చుకు తింటాను,'' అంటూ పట్టరాని ఆగ్రహంతో పళ్ళు కొరుకుతున్నాడు. – (ఇంకావుంది)



బేతాళ
కథలు

# సేనాధిపతి ఎన్నిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసు కుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఏ మహత్కా ర్యాన్ని సాధించగోరి, ఏ మంత్రి సలహా మేరకు అర్ధరాత్రి అంధకారంలో ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. రాజ్య పాలకులు ఏదైనా సమస్య ఎదురై నప్పుడు మంత్రుల సలహాలు తీసు కోవడం పరిపాటి. అయితే, రాజులు తమపై ఉంచిన ప్రగాఢ విశ్వాసం కారణంగా, మహా మేధావులని పేరుగాంచిన మంత్రులు సైతం ఒక్కొక్కసారి కీలకమైన నిర్ణ యాలు తీసుకోవడంలో పొర



బాటు చేస్తూ ఉంటారు. అలాంటి వారి అనుచిత నిర్ణయాల కారణంగా, పాలకులకు అపార నష్టం వాటిల్లే అపాయం ఉంది. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు, సేనాధిపతి ఎన్నికలో సరైన నిర్ణయం తీసుకోలేకపోయిన ధర్మశీలుడనే మంత్రి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

క్షేత్రపాలుడనే రాజు శిల్పక్షేత్రం రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలించేవాడు. సూక్ష్మగ్రాహీ, మహామేధావీ అయిన మంత్రి ధర్మశీలుడు రాజుకు పాలనావ్యవహారాలలో తగిన సలహాలు ఇస్తూండేవాడు. ఆ రాజ్య సేనాధిపతి ప్రమాదవశాత్తు హఠాత్తుగా మరణించడంతో, కొత్త సేనాధిపతిని నియమించే బాధ్యతను రాజు, మంత్రికి అప్పగించాడు.

ప్రస్తుతం సైన్యంలో ఉన్న దళనాయకులలో ఒక్కరూ సేనాధిపతి పదవికి అర్హులు కారని గ్రహించడంతో మంత్రి, అర్హుడైన వీరుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు. కార్తీక పౌర్ణమినాడు రాజధానిలో నిర్వహించే యుద్ధ విద్యల పోటీల్లో, విజేత అయిన వీరుణ్ణి సేనాధిపతిగా నియమించగలమని రాజ్యం నలుమూలలా చాటింపు వేయించాడు.

పోటీల్లో పాల్గొనడానికి పలువురు యువకులు వచ్చారు. అనుకున్న రోజున పోటీలు నిర్వహించ బడ్డాయి. సూక్ష్మధరుడు, రూపసేనుడు అనే ఇద్దరు యువకులు అన్ని పోటీలలోనూ ఒకరికొకరు సమానంగా వచ్చారు. ఆ ఇద్దరిలో ఒకరిని ఎంపిక చేయడం మంత్రికి సమస్యగా తయారయింది.

ఈ విషయంగా మంత్రి తీవ్రంగా ఆలోచించి ఆ యువకులిద్దరినీ పిలిచి, ''మీరిరువురూ యుద్ధవిద్యలలో అసాధారణ ప్రతిభ గలవారే. దాని ఆధారంగా మీలో ఏ ఒక్కరిని ఎంపిక చేసినా, మరొకరికి అన్యాయం చేసినట్టే అవుతుంది. ఎంతో బాధ్యతాయుతమైన సేనాధిపతి పదవిని చేపట్టబోయే వీరుడికి ధైర్యసాహసాలు, యుద్ధవిద్యలలో నైపుణ్యంతో పాటు, చక్కని మేధాశక్తి కూడా అవసరం గనక, మీ మేధస్సును పరీక్షించదలిచాను. అందుకు మీకు సమ్మతమే కదా?'' అని అడిగాడు.

''యుద్ధ విద్యలలో ఫలితం తేలనప్పుడు, మేధస్సుకు పరీక్ష పెట్టడం సమంజసమే.

నేను అందుకు సిద్ధమే,'' అన్నాడు సూక్ష్మ ధరుడు వెంటనే.

''ఈ విషయంలో అభ్యంతరం చెప్పడానికి ఏమీ లేదు. నాకూ సమ్మతమే,'' అన్నాడు రూపసేనుడు.

''సరే, రేపు రాజు, సభాసదుల సమక్షంలో నేను మిమ్మల్ని మూడు ప్రశ్నలు అడుగు తాను. మీ ఇద్దరిలో ఎవరి సమాధానాలు ఆమోదయోగ్యంగా ఉంటాయో, వారినే సేనాధిపతిగా నియమించడం జరుగు తుంది,'' అన్నాడు మంత్రి.

''అలాగే,'' అన్నారు ఇద్దరు యువకులు ముక్తకంఠంతో.

మరునాడు రాజు సమక్షంలో సభ ఏర్పాట యింది. ఇద్దరు యువకులూ ఉచిత ఆస నాలలో ఆసీనులయ్యారు.

మంత్రి ధర్మశీలుడు లేచి నిలబడి, ''మీరు నగరంలో ప్రధాన రహదారి వెంట వెళుతున్నారు. అక్కడ ఇద్దరు యువకులు కొట్లాడుకుంటూ కనిపించారు. అప్పుడు మీరేం చేస్తారు?'' అని యువకులను ప్రశ్నిం చాడు.

''మంత్రివర్యా, రూపసేనుడు నాకన్నా చిన్నవాడు. మొదటి అవకాశం అతనికే ఇవ్వండి,'' అన్నాడు సూక్ష్మధరుడు.

మంత్రి మౌనంగా తల పంకించి, రూప సేనుడికేసి నీ సమాధానం ఏమిటి? అన్నట్టు చూశాడు.

''మంత్రి వర్యా, ప్రధాన రహదారిలో కొట్లాడుకోవడం నేరం గనక, వెంటనే ఆ



ఇద్దరినీ బంధించి, చెరసాలలో వేస్తాను,'' అన్నాడు రూపసేనుడు.

''నువ్వేం చేస్తావు?'' అంటూ మంత్రి సూక్ష్మధరుడికేసి చూశాడు.

''రహదారిలో ఇద్దరు యువకులు కొట్లాడు కుంటున్నారంటే, దానికి కారణం ఏదో ఉంటుంది. అందువల్ల వాళ్ళ దగ్గరికి వెళ్ళి, కారణం ఏమిటో తెలుసుకుని తప్పెవరిదో విచారించి, సమస్యను పరిష్కరిస్తాను,'' అన్నాడు సూక్ష్మధరుడు.

ధర్మశీలుడు ఆ సమాధానాన్ని మెచ్చుకుం టున్నట్టు తల పంకించి, ''ఇక నా రెండవ ప్రశ్న. రాజ్యంలో కొందరు విప్లవకారులు తయారై, ప్రజలను తిరుగుబాటుకు ఉసి గొల్పుతున్నారు. అప్పుడు మీరేం చేస్తారు?'' అని అడిగాడు.

''చారుల ద్వారా విప్లవకారులకు గల బలాబలాలను తెలుసుకుని, తగిన సైన్యంతో వెళ్ళి వాళ్ళను అణచివేస్తాను,'' అన్నాడు రూపసేనుడు ఆవేశంగా.

ఆ తరవాత సూక్ష్మధరుడు, ''మంత్రివర్యా, రాజ్యంలో రాజుకు వ్యతిరేకంగా విప్లవకారులు తయారయ్యారంటే దానికి ముఖ్య కారణం పరిపాలనలోని లోటుపాట్లే అయి వుండాలి. ప్రజల సమస్యలను పరిష్కరించడంలో జాప్యమో, అలసత్వమో చోటు చేసుకుని ఉండవచ్చు. అందువల్ల ముందుగా విప్లవకారులను చర్చలకు పిలుస్తాను. వాళ్ళ నుంచే సమస్యలు ఏమిటో గ్రహిస్తాను. నిజంగా పాలనా లోపాలుంటే సత్వరంగా సరిదిద్దుకునేలా చేస్తాను. అలా కాకుండా విప్లవకారులది తలాతోకాలేని వ్యవహారం అయితే, వెనువెంటనే సైన్యంతోవెళ్ళి వాళ్ళను సమూలంగా నాశనం చేస్తాను,'' అన్నాడు దృఢమైన కంఠస్వరంతో.

''చక్కగా చెప్పావు, సూక్ష్మధరా,'' అని మెచ్చుకున్న మంత్రి, ''ఇప్పుడు నా మూడవ ప్రశ్న. రాజుగారితో కలిసి మీరు వేటకు వెళ్ళారు. హఠాత్తుగా ఒక సింహం రాజుగారి మీదికి దాడి చేసింది. అప్పుడు మీరేం చేస్తారు?'' అని అడిగాడు.

''ఇందులో ఆలోచించడానికి ఏముంది? వెంటనే రాజుగారిని తప్పించి, దాడి చేసిన సింహాన్ని నా భుజబలంతో మట్టుబెడతాను. రాజుగారిని రక్షిస్తాను,'' అన్నాడు రూపసేనుడు.

''నువ్వేం చేస్తావు?'' అని సూక్ష్మధరుణ్ణి అడిగాడు మంత్రి.

''నేను ఫక్కన ఉండగా, రాజుగారి మీద సింహం దాడి చేసేఅవకాశమే లేదు. నేను



అంత అప్రమత్తంగా ఉంటాను,'' అన్నాడు సూక్ష్మధరుడు.

ఆ సమాధానాన్ని రాజుగారితో సహా సభాసదులందరూ మెచ్చుకున్నారు. సభామంటపం చప్పట్లతో మారుమోగింది.

ఆ తరవాత కొంతసేపు మౌనంగా ఆలోచించిన మంత్రి మందహాసం చేస్తూ, ''వీర యువకులారా, మొదట మిమ్మల్ని మూడు ప్రశ్నలే అడగాలనుకున్నాను. అయితే, ఇప్పుడు ఇంకొక్క ప్రశ్న అడగాలనుకుంటున్నాను. మన రాజ్యాన్ని ఆనుకుని మూడు రాజ్యాలు ఉన్నాయనుకుందాం. వాటిలో ఒకటి బంగారు నిధులతో తులతూగుతోంది. రెండవ రాజ్యం నిండా ఆయుధాలున్నాయి. మూడవ రాజ్యం ధాన్య సంపదకు నిలయం. ఈ మూడు రాజ్యాల మీదా దాడి చేయవలసి వస్తే, మొదట మీరు ఏ రాజ్యం మీదికి దండెత్తి వెళతారు?'' అని అడిగాడు.

''ఈ ప్రశ్నకూ, మా ఎన్నికకూ సంబంధం ఏమిటో నాకు తెలియడం లేదు. అలాంటి పరిస్థితిలో రాజాజ్ఞను శిరసావహించడమే సేనాధిపతి కర్తవ్యం. అందువల్ల రాజూ, మంత్రులూ నిర్ణయించే రాజ్యం మీదికి దండెత్తివెళ్ళి విజయం సాధిస్తాను,'' అన్నాడు రూపసేనుడు.

''నీ అభిప్రాయం ఏమిటి?'' అని అడిగాడు సూక్ష్మధరుణ్ణి మంత్రి.

''సైన్యాన్ని బలోపేతం చేయడమే సేనాధిపతి ప్రథమ కర్తవ్యం. సైన్యం అజేయం కావాలంటే ఆయుధాలు చాలా అవసరం. ఆయుధాలు మన వశమైతే ధైర్యం పెరుగుతుంది. ఆయుధబలం, ధైర్యం ఉంటే మిగిలిన రెంటినీ వశపరచుకోవడం అత్యంత సులభం. ధైర్యలక్ష్మి ఉన్న చోటే మిగిలిన ఏడుగురు లక్ష్ములూ కొలువుంటారన్నది తమకు తెలియనిది కాదు. అందువల్ల నేను ఆయుధాలు ఉన్న రాజ్యం మీదికే మొదట దాడి చేస్తాను,'' అన్నాడు సూక్ష్మధరుడు గంభీరంగా.



ఆ సమాధానం విని అందరూ ముగ్ధులయ్యారు. మొదటి నుంచీ అతని సమాధానాలు అద్భుతంగా ఉన్నాయి. సూక్ష్మధరుడే సేనాధిపతిగా ఎన్ని[illegible] అందరూ అనుకున్నారు. అయితే, [illegible]నీ ఆశ్చర్యపరిచే విధంగా మం[illegible]రు[illegible]ణ్ణి సేనాధిపతిగా ఎన్నిక చేశాడు. రా[illegible] దానిని సంతోషంగా ఆమోదించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, యుద్ధ విద్యల పోటీల్లో సమ ఉజ్జీలుగా వచ్చిన సూక్ష్మధరుడు, రూపసేనుల మేధాశక్తిని పరీక్షించి వారిలో ఉత్తముణ్ణి సేనాధిపతిగా నియమించాలన్నది మంత్రి ధర్మశీలుడి ఉద్దేశం. అయితే, తాను అడిగిన ప్రశ్నలన్నిటికీ ఉత్తమ సమాధానాలిచ్చాడని సూక్ష్మధరుణ్ణి మెచ్చుకున్న ధర్మశీలుడు, అతన్ని కాదని రూపసేనుణ్ణి సేనాధిపతిగా ఎన్నిక చేయడం అసంబద్ధ నిర్ణయం కాదా? మంత్రి నిర్ణయాన్ని రాజు ఆమోదించడం అంతకన్నా విడ్డూరం కాదా? ధర్మశీలుడి నిర్ణయంలో ఏదైనా ఆంతర్యం ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మేధస్సులో, విశ్లేషణా శక్తిలో రూపసేనుడి కన్నా సూక్ష్మధరుడు ఉన్నతుడే. అందులో ఏమాత్రం సందేహం లేదు. అందుకే మంత్రి ధర్మశీలుడు అతని సమాధానాలు విని అభినందించాడు. అయితే, అంతటి మేధాశక్తి, చొరవ, సమస్యల మూలకారణాలను విశ్లేషించగల సూక్ష్మబుద్ధి గలవాడి చేతిలో రాజ్య సైన్యం ఉండడం రాజుకు క్షేమంకాదు. భవిష్యత్తులో పాలనా వ్యవహారాలలో నిర్ణయాలు తీసుకోవడంలో సూక్ష్మధరుడికీ, రాజుకూ మధ్య ఏవైనా అభిప్రాయ భేదాలు తలెత్తితే రాజుకు ముప్పుగా పరిణమించే ప్రమాదం ఉంది. రాజూ, మంత్రీ ఇచ్చే ఆజ్ఞలను చక్కగా నెరవేర్చడం ఒక్కటే సేనాధిపతి కర్తవ్యం. అందుకు సాధారణ మేధాశక్తి చాలు. యుద్ధవిద్యలలో సూక్ష్మధరుడికి దీటైన వీరుడైన రూపసేనుడిలో ఆమాత్రం తెలివితేటలకు లోటు లేదు. సేనాధిపతి ఎన్నికలో మంత్రి తీసుకున్న నిర్ణయంలో దూరదృష్టి, వివేకం తప్ప పొరబాటు, అలసత్వం అన్నవి ఇసుమంత కూడా లేవు. అందుకే మంత్రి నిర్ణయాన్ని రాజు సంతోషంగా ఆమోదించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : టి. రాజేంద్ర రచన]






## మొట్టమొదటి వస్తుప్రదర్శనశాల



భారతదేశంలో మొట్టమొదటి వస్తుప్రదర్శన శాల కొల్‌కతాలో 1857వ సం.లో ఏర్పాటు చేయబడింది. ఐదు వేల సంవత్సరాల ప్రాచీన వారసత్వంగల మనదేశంలోని వస్తువులను అక్కడ ప్రదర్శనకు ఉంచారు. యాసియాటిక్ సొసైటీ భవనంలోని ఒక భాగంలో దీనిని ఏర్పాటు చేశారు. భర్హట్ రూమ్ అందులోని ప్రధాన ఆకర్షణ. సుంగా వంశస్థులకు సంబంధించిన అవశేషాలను అక్కడ ఉంచారు. మధ్యప్రదేశ్‌లోని ఒక గ్రామం భర్హట్. 1873వ సం.లో అక్కడ ఒక బౌద్ధస్థూప శిథిలాలు కనుగొనబడ్డాయి. వాటిలో శిలాఫలకాలు, ఒక సింహద్వారం కూడా ఉన్నాయి. మత సంబంధమైన వాటితోపాటు సాధారణ జన జీవనానికి సంబంధించిన దృశ్యాలు కూడా చిత్రీకరించ బడి ఉన్నాయి. కొన్ని శిలాఫలకాలలో బుద్ధుడి పూర్వజన్మలకు సంబంధించిన జాతక కథల దృశ్యాలు చిత్రీకరించబడి ఉన్నాయి.



## మొదట నిర్మించు, తరవాత పడగొట్టు!

లక్నోలోని బడా ఇమాంబర, భవనం చిక్కుదారులుగల మంటపాలు 'భూల్ భూలయాన్'లకు చాలా ప్రసిద్ధి గాంచింది. ఈ భవనం భయంకరమైన కరువు రోజుల్లో నిర్మించబడింది. కరువు బాధితులకు ఉపాధి కల్పించాలని అప్పటి నవాబు ఆశించాడు. అందువల్ల పగటి పూట నిర్మించిన కట్టడాలను రాత్రిపూట పడగొట్టమని కూలీలను పురమాయించాడు. భవన నిర్మాణంలో ఉద్దేశపూర్వకంగా చేసిన ఈ జాప్యం, కూలీలకు వరంలా ఉపకరించింది!




# ఆస్తి పంపకం

వజ్రకరూరులోని సిద్ధరామయ్య గొప్ప పరోపకారిగా పేరుగాంచాడు. అడిగినవారికి లేదనకుండా అంతో ఇంతో ఇవ్వకుండా పంపేవాడు కాదు. పేదరికం నుంచి ఒక్కొక్క మెట్టుగా పైకి వచ్చినవాడు గనక, ఆయనకు లేనివారి కష్ట నష్టాలు బాగా తెలుసు. చిన్న పచారీ కొట్టుతో జీవితాన్ని ప్రారంభించి ఈనాటికి వజ్రకరూరులో ధనవంతులైన వ్యాపారుల్లో ఒకడుగా నిలవగలిగాడు. పాడి-పంట, ధన కనక వస్తు వాహనాలు సమకూర్చుకోవడంతో పాటు, ఇంద్రభవనంలాంటి ఇల్లు కూడా తన స్వార్జితంతో కట్టించాడు.

ఆయనకు శిశిరుడు, వసంతుడు, హేమంతుడు అని ముగ్గురు కుమారులు. వివాహితులైన ముగ్గురూ మూడు రకాల వ్యాపారాలను తండ్రిలాగే దక్షతతో నిర్వహిస్తున్నారు.

వయసు మీద పడుతున్న కొద్దీ సిద్ధరామయ్యకు పిల్లలకు ఆస్తి పంపకం చేసి బాధ్యత తీర్చుకోవాలన్న ఆలోచన బలీయం కాసాగింది. ఒకనాడు ఆయన తన ఆప్త మిత్రుడైన నిపుణకుణ్ణి పిలిచి, తన మనసులోని మాట చెప్పాడు. ఇద్దరూ చర్చించి, ఇంటిని తప్ప మిగతా వాటిని ముగ్గురికీ సమంగా విభజించాలని నిర్ణయించారు. ఇంటిని మాత్రం మూడుగా విడగొట్టడం సిద్ధరామయ్యకు ఇష్టం లేదు.

''ప్రతిరోజూ ఎంతలేదన్నా నలుగురైదుగురికి ఆతిథ్యమిచ్చే అన్నపూర్ణ నా ఇల్లు. నేను ఉన్నా, లేకపోయినా ఈ ఇంట్లో ఇదే సంప్రదాయం కొనసాగాలన్నది నా ఆశయం. అందుకు ఎవరు ఒప్పుకుంటేవారిదేఈ ఇల్లు,'' అన్నాడు సిద్ధరామయ్య నిపుణకుడితో.

''అలా జరిగితే అన్న దమ్ముల మధ్య ఇర్ష్యాద్వేషాలూ, స్పర్థలూ తలెత్తే అవకాశం ఉంది. బాగా ఆలోచించి చూడు,'' అన్నాడు నిపుణకుడు.

''అందుకే నీ సలహా కోరుతున్నాను. ఈ ఆస్తి నా స్వార్జితం. కాబట్టి దీన్ని పంచడం

నందిరాజు పద్మలతా జయరాం

నా ఇష్టానుసారమే జరుగుతుంది. అయితే, దాని కారణంగా అన్నదమ్ముల మధ్య సాన్నిహిత్యం తరిగి, స్పర్థలు పెరగకూడదు. ముగ్గురుగా విడిపోయి బతకడం కన్నా ఒకటిగా కలిసి ఇదే ఇంట్లో ఉండాలన్నదే నా అభిమతం. పరోపకారబుద్ధిగలవాడికి ఈ ఇంటిని అప్పగించడం అవసరం. ఈ ముగ్గురిలో అలాంటి వాడెవడో నిర్ణయించడం నీ చేతుల్లో ఉంది,'' అన్నాడు సిద్ధరామయ్య.

నిపుణకుడికి ఇది పరీక్షలా తయారయింది. ''ముగ్గురూ మంచివాళ్ళే. ఎవరికీ హాని తలపెట్టే స్వభావులుకారు. వారిలో ఒకరిని నిర్ణయించడం కష్టమే,'' అనుకుంటూ ఆయన ఇంటికి బయలుదేరాడు.

మూడు రోజులు తీవ్రంగా ఆలోచించగా ఆయనకు ఒక ఉపాయం తట్టింది. వెంటనే సిద్ధరామయ్యకు తెలియజేశాడు. ఆయన సరే అన్నాక నిపుణకుడు తన పరీక్షను ప్రారంభించాడు.

ఆయన మొదట పెద్దవాడైన శిశిరుణ్ణి పిలిచి, ''నాయనా, నువ్వు నా ప్రాణమిత్రుడి కుమారుడివి. నా బిడ్డతో సమానం. ఇటీవల హిమాలయాల నుంచి ఒక సిద్ధుడు అద్భుత మహిమ గల నాలుగు ఫలాలు తీసుకు వచ్చాడు. వాటిని భుజిస్తే అశ్వనీ దేవతలంత ఆరోగ్యం, కుబేరుడంతటి ధనం లభిస్తుంది. నా పిల్లలకు మూడు ఇవ్వగా ఒకటి మిగిలింది. ఐహిక బంధాల నుంచి విముక్తికోసం ప్రయత్నిస్తూన్న నాకూ, నీ తండ్రికీ దీని అవసరం లేదు గనక, దీన్ని నువ్వు తీసుకో. ఇప్పటికిప్పుడే తిన్నావంటే నాకూ చాలా సంతోషం,'' అన్నాడు.





ఆ మాట వినగానే శిశిరుడి కళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి. ''నా మీద మీకున్న ప్రేమాభిమానాలకు కృతజ్ఞుణ్ణి మామయ్యా. మీ మాట నాకు వేదవాక్కు. ఇదిగో ఎవరి కంటా పడకుండా ఇక్కడే తింటాను,'' అంటూ ఫలాన్ని అందుకుని మొత్తం తిని, పదే పదే కృతజ్ఞతలు చెప్పి, ఆనందంగా వెళ్ళిపోయాడు.

ఆ తరవాత వసంతుణ్ణి పిలిపించి, నిపుణకుడు శిశిరుడితో చెప్పినట్టే చెప్పాడు.

''చాలా సంతోషం మామయ్యా. అయినా, అంత మహిమ గల ఫలాన్ని నేనొక్కణ్ణే తినలేను. అన్నయ్యకు గానీ, తమ్ముడికి గానీ ఇవ్వండి. పంచుకుని తింటే ఫరవాలేదనుకుంటే మా ముగ్గురికీ సమానంగా పంచి ఇవ్వండి. ముగ్గురూ కలిసే తింటాం. ఆరోగ్యం, ఐశ్వర్యం అందరికీ కావలసినవే కదా!'' అన్నాడు వసంతుడు వినయంగా.

అతని మాటలను తోసి పుచ్చలేక నిపుణకుడు సరేనన్నట్టు తల ఊపి అతన్ని పంపేశాడు.

ఇక మూడోవాడు హేమంతుడి వంతు వచ్చింది. అతడు నిపుణకుడి మాటలకు ఆనందంతో ఉబ్బితబ్బియ్యాడు. ''మీకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియడం లేదు. కానీ, ఒక్క కోరిక,'' అని ఆగాడు హేమంతుడు.

ఏమిటి అన్నట్టు చూశాడు నిపుణకుడు.

''నా భార్యాబిడ్డల ఆరోగ్యం, ఐశ్వర్యాలకు మించిన ఆనందం నాకు ఇంకేం ఉంటుంది? తమకు అంగీకారమైతే వాళ్ళను ఇక్కడికి రహస్యంగా పిలిపిస్తాను. మేమం

దరం పంచుకుని ఆ ఫలాన్ని ఆరగిస్తాం, ఏమంటారు?'' అన్నాడు.

''సరే,'' అన్నాడు నిపుణకుడు.

రెండు రోజుల తరవాత సిద్ధరామయ్యను తన ఇంటికి ఆహ్వానించిన నిపుణకుడు, ''ఇంటి భారం మొత్తం వసంతుడికి అప్ప గించు. నువ్వు ఆశిస్తున్నట్టే పదిమందీ నీ పరోపకార గుణాన్ని పది కాలాలపాటు గుర్తుం చుకుంటారు. ఇల్లు చెక్కు చెదరకుండా నిలుస్తుంది,'' అని సలహా ఇచ్చాడు.

''ఈ నిర్ణయానికి ఎలా రాగలిగావు?' అని అడిగాడు సిద్ధరామయ్య మిత్రుణ్ణి.

నిపుణకుడు జరిగింది వివరించి, ''నీ కొడుకులు ముగ్గురూ మంచివారే. అందులో సందేహం లేదు. అయితే, పెద్దవాడు శిశిరుడు తన కోసం మాత్రమే ఆలోచిస్తాడు. ఇతరుల గురించి పట్టించుకోడు. మూడవవాడు హేమంతుడు తన ఆలోచనా పరిధిని తన భార్యాపిల్లల వరకు మాత్రమే విస్తరించ గలడు. ఇతనికి కూడా ఇతరుల గురించిన ఆలోచనలేదు. పోతే, రెండవ కొడుకు వసం తుడు మాత్రమే తనూ, తన కుటుంబంతో పాటు పరుల క్షేమం గురించి కూడా ఆలో చించే విశాల దృక్పథం కలవాడు. పరోప కారమే పరమార్థంగా భావించే నీకు తగిన వారసుడు అతడే. అందువల్ల నువ్వు నిశ్చిం తగా ఇంటి బాధ్యతలను అతనికి అప్పగించ వచ్చు. నీ ఆశయం నెరవేరి, నీ కుటుంబ గౌరవం చిరకాలం నిలిచి ఉంటుంది. నిజా నికి నేనిచ్చినవి మా పెరట్లో పండిన తియ్యటి ఫలాలు మాత్రమే,'' అన్నాడు నవ్వుతూ.

''సూక్ష్మదృష్టితో తెలివిగా నా సమస్యను పరిష్కరించావు. చాలా సంతోషం,'' అని మిత్రు డికి కృతజ్ఞతలు తెలియజేసి ఇంటికి బయలు దేరాడు సిద్ధరామయ్య.

కొన్ని రోజుల తరవాత సిద్ధరామయ్య, చెరొక వ్యాపారం నిర్వహిస్తున్న ముగ్గురు కొడుకులకు ఆయా వ్యాపారాలను వాళ్ళకే ఇచ్చేశాడు. మిగిలి ఉన్న తన ఆస్తిని రెండు భాగాలుగా చేసి శిశిరుడికీ, హేమంతుడికీ సమంగా పంచాడు. ఇంటినీ, ఇంటి బాధ్యత లనూ వసంతుడికి అప్పగించాడు. ఆయన ఆశయాలకు అనుగుణంగా నడుచుకుని వసంతుడు తండ్రి పేరు నిలబెట్టాడు.



# చందమామ కబుర్లు

## అంతరిక్షంలో ఘనవిజయం!



ఇండియా జనవరి 10వ తేదీ పిఎస్ఎల్వి-సి7ను అంతరిక్షంలోకి ప్రయోగించింది. భారతీయ అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో)కు ఇది రెండు కారణాలవల్ల ముఖ్యమైన రోజు. ఒకే రాకెట్‌లో నాలుగు శాటలైట్లను ప్రయోగించడం మొదటి విశేషం. ప్రయోగించాక ఒక రాకెట్‌లోని సూక్ష్మనాళిక (క్యాప్సూల్)ను విజయవంతంగా కిందికి దించడం రెండవ విజయం. 680 కి.గ్రా. శాటలైట్ కార్టోశాట్-2ను మొదట కక్ష్యలోకి ప్రవేశ పెట్టారు. ఇండియన్ మిషన్ 550కి.గ్రా. శాటలైట్ రికవరీ ఎక్స్పెరిమెంట్ ఎస్ఆర్ఇ-1 తరవాత 'ఇన్‌జెక్ట్' చేయబడింది. ఇదంతా 19 నిమిషాలలో విజయవంతంగా జరిగిపోయింది. అంతరిక్ష నౌక నిర్మాణం పనులూ, అందులో నాలుగు రాకెట్లను అమర్చడం రెండు నెలలలో పూర్తయ్యాయి. ఎంతో పకట్బందీగా జరిగిన ప్రయోగం ఇది అని ఇస్రో అధ్యక్షులు శ్రీ జి. మాధవన్ నాయర్ తెలియజేశారు.

## బడిపిల్లలతో ముచ్చటించిన వ్యోమగామి

ఇండియా పిఎస్ఎల్విని ప్రయోగించిన ఒక రోజు తరవాత అంటే జనవరి 11వ తేదీ భూమికి 360 కి.మీ. దూరంలో ఉన్న అంతర్జాతీయ అంతరిక్ష కేంద్రం నుంచి భారతీయ సంతతికి చెందిన మహిళా వ్యోమగామి సునీతా లిన్ విలియమ్స్, న్యూఢిల్లీ అమెరికా రాయబార కార్యాలయంలో సమావేశమైన పాఠశాల విద్యార్థులతో ముచ్చటించింది. ఒక విద్యార్థి అడిగిన ప్రశ్నకు, ''భూమి చాలా అందమైన గ్రహం. ఇక్కడి నుంచి భూగ్రహం మీది మనుషులతో మాట్లాడడం నమ్మ లేకుండా ఉన్నాను,'' అని సమాధానమిచ్చింది సునీత. భూమికి తిరిగి రావడానికి ఆత్రుతతో ఎదురు చూస్తున్నట్టు ఆమె చెప్పింది. ''అంతరిక్షంలో నడవడం ఎలా ఉంది?'' అని మరో పాపాయి అడిగిన ప్రశ్నకు, ''అలా తేలిపోతూ నడవడం నమ్మశక్యం కాకుండా ఉంది. అంతరిక్షం నుంచి భూమిని చూస్తూంటే, ప్రపంచమంతా అందమైన ఒకే ప్రదేశంగా కనిపిస్తోంది!'' అని సమాధానమిచ్చింది.



# చందమామ ఇండియా క్విజ్ - 2

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

ఈ నెల క్విజ్‌లో భారత చరిత్ర గురించి తెలుసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి), పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 2 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. మే 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. కుషాణు వంశ స్థాపకుడు ఎవరు?
2. చంద్రగుప్త మౌర్యుడు తన చివరి రోజులు ఎక్కడ గడిపాడు?
3. ఎల్లోరా శివుడి గుహాలయాన్ని నిర్మించిన వారెవరు? ఎప్పుడు?
4. విజయనగర సామ్రాజ్య శిథిలాలు చూడాలంటే మనం ఎక్కడికి వెళ్ళాలి?
5. మరాఠా అధికారాన్ని అంతమొందించిన యుద్ధం ఏది?
6. ఇండియాలో రూపాయి ద్రవ్యమానాన్ని ప్రవేశపెట్టిన వారెవరు?
7. ఢిల్లీ నుంచి పరిపాలించిన ముస్లిం మహిళ ఎవరు?
8. బౌద్ధ మతాన్ని స్వీకరించాక మిళిందుడని పేరు పెట్టుకున్న వారెవరు?
9. బుందేల్‌ఖండ్ రాజపుత్ర పాలకులు ఎవరు?
10. హర్షవర్ధనుడి రాజధాని ఏది?
11. 'ఫాదర్ ఆఫ్ ఇండియన్ సివిల్ సర్వీస్'గా పేరుగాంచిన వారెవరు?
12. అక్బర్ స్మారకచిహ్నం ఎక్కడ ఉన్నది?




# రొట్టెల పండుగ

దేవీపురం గ్రామంలో శివదాసు అనే గృహస్థు ఉండేవాడు. అతడు నిత్యాన్నదానం చేస్తుండే వాడు. ఒక రాత్రి సమయాన ఒక వృద్ధురాలు వచ్చి శివదాసు ఇంటి తలుపు తట్టింది. శివ దాసు భార్య లేచి తలుపు తీసి వృద్ధురాలిని, ''ఏమ్మా, ఏం కావాలి?'' అని అడిగింది.

అప్పుడా వృద్ధురాలు, 'నేను వచ్చింది నీ కోసం కాదు, నీ భర్తను పిలువు,'' అన్నది.

ఆ మాట విన్న శివదాసు బయటకువచ్చి, ఆ వృద్ధురాలిని చూసి నమస్కరించి, ''ఏం కావాలి తల్లీ?'' అని అడిగాడు.

''ఎవరైనా నీ ఇంటికి ఎందుకు వస్తారు? భోజనానికి వచ్చాను,'' అన్నది.వృద్ధురాలు.

''సంతోషం. రామ్మా లోపలికి,'' అని పిలిచాడు శివదాసు.

'నేను భోజనం చేయాలంటే ముందుగా నువ్వు నాకొక మాట ఇవ్వాలి,'' అన్నది వృద్ధు రాలు. ''ఏం చెయ్యాలో చెప్పు తల్లీ,'' అని అడిగాడు శివదాసు.

'నేను చాలా కష్టాల్లో ఉన్నాను. మనసులో బాధ ఉండగా నేను భోజనం చేయలేను. నా కష్టాలన్నీ నువ్వు తీసుకోగలిగితే, నేను సంతో షంగా భోజనం చేస్తాను,'' అన్నది వృద్ధురాలు.

వెంటనే శివదాసు, ''ఈ క్షణం నుంచి నీ కష్టాలన్నీ నేను తీసుకుంటున్నాను. వచ్చి భోజనం చెయ్యి తల్లీ,'' అన్నాడు శివదాసు.

ఆ మాటకు వృద్ధురాలి ముఖం విప్పా రింది. ''సంతోషం, నాయనా. ఎదుటి వారి కష్టాలు స్వీకరించగలవారు ఎందరుంటారు? తప్పక నీ ఆతిథ్యం స్వీకరిస్తాను. అయితే, ఇంట్లోకి మాత్రం రాను. ఇల్లు నాకు ఇరు కుగా ఉంటుంది. ఇక్కడే ఉంటాను. వెళ్ళి భోజనం తీసుకురా. మరో మాట. ఈ రోజు నాకెందుకో రొట్టెలు తినాలని ఉంది. ఉంటే జొన్నరొట్టెలు తీసుకురా నాయనా,'' అన్నది.

''అలాగే నమ్మా'' అంటూ లోపలికి వెళ్ళి, భార్య చేత త్వరత్వరగా రెండు జొన్నరొట్టెలు చేయించి, బయటకు వచ్చిన శివదాసు

ఎస్. శివనాగేశ్వరరావు

అక్కడి దృశ్యం చూసి నిర్ఘాంత పోయాడు. వృద్ధురాలు కనిపించలేదు. ఆమె కూర్చున్న చోట అన్నపూర్ణేశ్వరీ దేవి విగ్రహం కనిపించింది. ఆ విగ్రహానికి నాగసర్పం పడగ పట్టి ఉంది.

తన ఇంటికి వచ్చింది సాక్షాత్తు అన్నపూర్ణే శ్వరీ దేవి అని గ్రహించి శివదాసు ఆనందంతో ఉప్పొంగి పోయాడు. క్షణాల్లో వార్త ఊరంతా తెలిసిపోయింది. జనం గుంపులు గుంపులుగా వచ్చి దేవిని దర్శించుకున్నారు.

మూడు నెలలు తిరిగే సరికి అందమైన ఆలయం నిర్మించి అమ్మవారిని అందులో ప్రతిష్ఠించారు. క్రమక్రమంగా ఎక్కడెక్కడి నుంచో వచ్చే భక్తులకు దేవీపురం ప్రజలు ఆతిథ్యం ఇచ్చేవారు. ''మీ కష్టాలు మేం స్వీకరిస్తున్నాం. మీకు అంతా శుభం జరుగుతుంది,'' అని చెప్పి రొట్టెలు పంచేవారు.

అప్పటి నుంచి యేటా రొట్టెల పండుగ జరపడం దేవీపురం ప్రజలకు ఆనవాయితీ అయింది. ఆ రొట్టెలు తిన్న వారికి అంతవరకూ ఉన్న సమస్యలు తీరిపోయి మనశ్శాంతి లభించేది. అంతే కాకుండా దేవీపురం గ్రామస్థులు పంచే రొట్టెలు అద్భుతమైన రుచితో, రాజుగారి ఇంట కూడా అంత రుచికరమైన రొట్టెలు దొరకవని పేరు గడించాయి.

ఆ సంగతి రాజుగారి వరకు వెళ్ళింది. రాజు ఆశ్చర్యపడి ప్రధాన వంటవాణ్ణి పిలిచి సంగతి చెప్పి, ''దేవీపురం రొట్టెలకు అంత ప్రసిద్ధి ఎలా వచ్చింది? ఒకసారి ఆ ఊరు వెళ్ళి, రొట్టెలను వాళ్ళెలా తయారు చేస్తారో తెలుసుకో,'' అన్నాడు. ''రొట్టెల రుచి తయారు చేయడంలో లేదు ప్రభూ. వాటిని చేయించి




ఇచ్చేవారి గొప్పగుణం, తినేవారు కోరుకునే మంచి కోరికలను బట్టి, ఉంటుంది,'' అన్నాడు వంటవాడు.

''ఏమిటి నువ్వంటున్నది?'' అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

''నా చిన్నప్పుడు దానికి సంబంధించిన ఒక విచిత్ర సంఘటన జరిగింది, ప్రభూ,'' అన్నాడు వంటవాడు.

''ఏమిటది?'' అన్నాడు రాజు.

''దేవీపురానికి పొరుగునే ఉన్న మంగాపురం మా స్వగ్రామం,'' అంటూ వంటవాడు ఇలా చెప్పసాగాడు:

ఆ ఊళ్ళో సంగడనేవాడు దొంగతనాలు చేస్తూ రోజులు గడిపేవాడు. అయితే, వాడి భార్య గౌరి, ''ఎంత కాలమని ఈ దొంగబతుకు బతగ్గలం? ఏ క్షణాన నీకేం జరుగుతుందోనని



నేనెంత భయపడుతున్నానో నీకు తెలియదు. దొంగతనాలు మానేసి కష్టపడి పనిచెయ్. కలో గంజో తాగి తృప్తిగా బతుకుదాం,'' అంటూ తరచూ పోరసాగింది.

భార్యకు తనంటే ఎంత ప్రేమో తెలిసిన సంగడు కొన్నాళ్ళకు ఆమె మాటల గురించి ఆలోచించడం మొదలు పెట్టాడు. అప్పుడే వాడికి దేవీపురం వెళ్ళి రొట్టెలు తింటే అనుకున్నది జరుగుతుందని తెలియ వచ్చింది. అక్కడికి వెళ్ళి రొట్టెలు తిని, ఎవరికీ తెలియకుండా పెద్ద దొంగతనం ఒకటి చేసి, జీవితంలో స్థిరపడి ఆ తరవాత దొంగతనాల జోలికి పోకూడదని నిర్ణయించుకున్నాడు.

అప్పటికప్పుడే సంగడు దేవీపురం బయలుదేరాడు. మార్గమధ్యంలో ఎదురు వచ్చినవారు తాము తిన్న రొట్టెల రుచి గురించి చెప్పుకుంటూంటే, సంగడికి నోరూరింది. ''ఈ రోజు నా పంట పండింది. రుచికరమైన రొట్టెలు. బోలెడంత ధనం దొరుకుతుంది,'' అనుకున్నాడు.

దేవీపురం చేరగానే రాందాసు అనే గృహస్థు ఎదురువచ్చి, ''అయ్యా, మా ఇంట ఆతిథ్యం స్వీకరించండి,'' అని చెప్పి సంగణ్ణి తన వెంట తీసుకుపోయి, ''మీ కష్టాలన్నిటినీ నేను స్వీకరిస్తున్నాను. మీకు శుభం జరుగుతుంది,'' అని చెప్పి రొట్టెలు ఇచ్చాడు.

సంగడు రొట్టెను నోట్లో పెట్టుకుని కొరికి దిగ్భ్రాంతి చెందాడు. అది భరించ లేనంత చేదుగా ఉంది. అది తెలియని రాందాసు, ''రొట్టె రుచిగా ఉంది కదా? అంతా అన్నపూర్ణేశ్వరి మహిమ!'' అన్నాడు. సంగడు మింగలేక, కక్కలేక ఒక రొట్టె తిని, మిగిలినవి మూటగట్టుకుని బయలుదేరాడు.

రొట్టె బాగుండకపోతే పోయింది, రాందాసు దీవించినట్టు శుభం జరిగితే చాలనుకుంటూ, సంగడు ఆ రాత్రి ఒక ధనికుడి ఇంట్లో దొంగతనానికి ప్రయత్నించాడు. అక్కడా వాడికి చేదు అనుభవమే ఎదురయ్యింది. పట్టుబడినవాణ్ణి ధనికుడి నౌకర్లు చితగ్గొట్టి వదిలారు. ముక్కుతూ మూలుగుతూ ఇల్లు చేరిన సంగణ్ణి చూసి, వాడి భార్య, ''వద్దంటే మానవుకదా?'' అని కళ్ళ నీళ్ళు పెట్టుకుని, ''ఇకపై అంతా మంచి జరగాలని దేవీపురం వెళ్ళి రొట్టెలు తెచ్చాను, తిను,'' అంటూ రెండు రొట్టెలు ఇవ్వబోయింది.

''నేనే స్వయంగా దేవీపురం వెళ్ళి రొట్టె తిన్నాను. చెప్పలేనంత చేదుగా ఉంది,'' అన్నాడు సంగడు బాధగా.

''మా అందరికీ ఎంతో రుచిగా ఉన్న రొట్టెలు, నీకు మాత్రం ఎందుకు చేదుగా ఉన్నాయి? అంటే అమ్మవారు నీ దుర్బుద్ధిని గ్రహించిందన్న మాట! ఇప్పుడు చెబుతు న్నాను. నువ్వు దొంగతనాలు మానకపోతే, ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను,'' అన్నది గౌరి కన్నీళ్ళు ఒత్తుకుంటూ.

''అంత పని చేయకు. దొంగతనాలు మానేస్తాను,'' అని భార్య దగ్గర ఒట్టు వేసిన సంగడిలో, అందరికీ రుచిగా ఉన్న రొట్టెలు తనకు మాత్రం ఎందుకు చేదుగా ఉన్నాయి? అన్న అనుమానం తలెత్తింది. ఆమాటే భార్యతో అన్నాడు. ''ఈ సంవత్సరమంతా బుద్ధిగా నడుచుకో. అప్పుడు తెలుస్తుంది అమ్మవారి రొట్టెల రుచి,'' అన్నది గౌరి.

ఆ రోజు నుంచి కూలిపనులు చేసు కుంటూ రోజులు గడుపుతూన్న సంగడికి అప్పుడప్పుడు దొంగతనాల మీదికి మనసు మళ్ళేది. అయినా, అతి ప్రయత్నం మీద వాటి జోలికి పోకుండా నిలదొక్కుకున్నాడు. సంవత్సరం గడిచాక, భార్యతో కలిసి దేవీపురం రొట్టెల పండుగకు వెళ్ళి, రొట్టెలు అందుకు న్నాడు. ఒక రొట్టె నోట్లో వేసుకోగానే అద్భుత మైన రుచిగాతోచింది. వాడికి తెలియకుండానే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అమ్మవారి గుడికి వెళ్ళి, ''క్షమించు తల్లీ, ఇక ఈ జన్మలో దొంగ తనాల జోలికి వెళ్ళను,'' అని భక్తితో చేతులెత్తి మొక్కుతూ ప్రార్థించాడు.

భర్తలో వచ్చిన మార్పుకు గౌరి సంతోషిం చింది. రెండేళ్ళు తిరిగే సరికి భార్యాభర్తలు కూలిపనులకు వెళ్ళే స్థితి నుంచి, సొంత పొలంలో పనిచేసుకునే స్థాయికి ఎదిగారు.

సంగడి కథ విన్న రాజు ఒకసారి దేవీపురం వెళ్ళి అన్నపూర్ణేశ్వరీ దేవిని దర్శించుకుని రావాలనుకున్నాడు. రాజు పరివారంతో బయలు దేరి వెళ్ళి, ప్రజలు ఎలాంటి కొరతా లేకుండా శాంతి సుఖాలతో జీవించాలని దేవికి మొక్కు కున్నాడు. గుడి నుంచి వెలుపలికి రాగానే, ఒక పేద రైతు అందించిన రొట్టెలు తిని, వాటి రుచికి ముగ్ధుడయ్యాడు. ఎదుటివారి కష్టా లను స్వీకరించే కరుణాహృదయంగల దేవీ పురగ్రామ ప్రజలకు ఎలాంటికొరతా రాకుండా చూసుకోవడానికి తగిన చర్యలు తీసుకు న్నాడు.



## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (15)

# ఢిల్లీ చాలాదూరంలో ఉంది!

ఢిల్లీ సుల్తాన్ ఘియాజుద్దీన్ తుగ్లక్ తన కోట చుట్టూ కొత్త ప్రహరీగోడ నిర్మించదలిచాడు. అది పద్నాలుగవ శతాబ్దం. ఆ కాలంలో నగరం పరిసరాలలో కూలీలు అంతగా లేరు. అయినా, తన అధికారులు కావలసినంత మందిని తీసుకురాగలరన్నది సుల్తాన్ గట్టి నమ్మకం. అయితే అలా జరగలేదు. ఉన్న కూలీలందరూ ఒక చెరువు తవ్వడంలో తీరిక లేకుండా శ్రమిస్తున్నారు. హిందువులూ, ముస్లింలూ ప్రేమతో గౌరవించే ఫకీరు నిజాముద్దీన్ ఔలియా కోరిక మేరకు ఆ చెరువును తవ్వుతున్నారు.

ఆ సంగతి తెలిసిన సుల్తాన్ అసహనంతో, "ఔలియా చెరువుపని తరవాత చూడవచ్చు. కూలీలను ముందు ఇక్కడికి తీసుకురండి," అని అజ్ఞాపించాడు. సుల్తాన్ అజ్ఞను కూలీలకూ, ఫకీరుకూ తెలియజేశారు. "ప్రహరీగోడ తరవాత నిర్మించవచ్చు," అన్నాడు ఫకీరు. కూలీలు కూడా సుల్తాన్ అజ్ఞను అంతగా పట్టించుకోలేదు. ఫకీరు వద్ద కూలీ పుచ్చుకోకుండానే, కూలీలు చెరువు నిర్మాణానికి శ్రమిస్తున్నారన్న సంగతి తెలిసి సుల్తాన్ మరింత ఆగ్రహానికి లోనయ్యాడు.

ఔలియాకు సరైన గుణపాఠం నేర్పాలని సుల్తాన్ నిర్ణయించాడు. అయితే, అంతకు ముందు అతడు తన రాజ్యంలో అంతర్భాగమైన బెంగాలులో తిరుగుబాటు చెలరేగడంతో దానిని అణచడానికి సైన్యంతో వెళ్ళవలసి వచ్చింది. ఆ సమయంలో ఆయన కుమారుడు ముహమ్మద్ పరిపాలనా బాధ్యతలు చేపట్టి ఢిల్లీలోనే ఉండిపోయాడు. తను తిరిగి వచ్చేలోగా, ఎలాగైనా చెరువు తవ్వుతూన్న కూలీలను తెప్పించి గోడ కట్టే పని పూర్తి చేయమని సుల్తాన్ కొడుకును పురమాయించి వెళ్ళాడు. అయితే ముహమ్మద్‌కు ఫకీరు ఔలియా పట్ల ఎనలేని గౌరవాదరాలు ఉండేవి. అందువల్ల చెరువు తవ్వే పనిని ఆపడానికి అతడెలాంటి ప్రయత్నమూ చేయలేదు.

సుల్తాన్ ఘియాజుద్దీన్ జయప్రదంగా బెంగాలు తిరుగుబాటును అణచివేశాడు. అదే సమయంలో రాజధానిలో జరుగుతూన్న విషయాలను కూడా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వచ్చాడు. ఫకీరు పట్ల పగ సాధించాలని తహతహలాడసాగాడు. కొడుకు ముహమ్మద్ పట్ల కూడా అతనిలో ఏహ్యాభావం కలిగింది.



ఆయన తిరిగిరాగానే ఫకీరును తప్పక హత మార్చి, కొడుకును కఠినంగా శిక్షించగలడని అందరూ భావించారు. భక్తులూ, శ్రేయోభిలాషులూ ఫకీరును ఢిల్లీ నుంచి వెళ్ళిపొమ్మని సలహా ఇచ్చారు. అయితే, ఫకీరు నవ్వి ఊరుకున్నాడు.

"మహాత్మా, సుల్తాన్ ఢిల్లీ వచ్చాడంటే మీ స్థితి ఆలోచించి చూడండి," అని పలువురు హెచ్చరించారు.

"ఢిల్లీ దూర్ అస్త్! (ఢిల్లీ చాలా దూరంలో ఉంది)" అని ఫకీరు మందహాసంతో సమాధాన మిచ్చాడు.

విజయాన్ని సాధించి రాజధానికి తిరిగి వస్తున్న తండ్రికి ఘన స్వాగతం పలకడానికి ముహమ్మద్ అందమైన వేదికనూ, బ్రహ్మాండమైన ద్వారతోరణాన్నీ నిర్మించడంలో నిమగ్నుడయ్యాడు. సుల్తాన్ రాజధానిని సమీపించాడు.

భీతిల్లి శంకించిన భక్తులు, "దయచేసి ఇక్కడి నుంచి తప్పించుకుని వెళ్ళండి. మీ ప్రాణాలు కాపాడుకోండి," అని ఫకీరును వేడుకున్నారు.

"ఢిల్లీ చాలాదూరంలో ఉంది!" అన్నాడు ఫకీరు మళ్ళీ అదే మందహాసంతో.

సుల్తాన్ మేళతాళాల మధ్య అమితోత్సాహంతో స్వాగత ద్వారతోరణం గుండా వేదిక మీదికి ఎక్కాడు. అక్కడ చక్కగా అలంకరించబడిన రెండు ఆసనాలు ఉన్నాయి. ఒకటి సుల్తానుకూ, రెండవది ముహమ్మదుకూ. అయితే, ముహమ్మదుకని వేయబడిన ఆసనంలో సుల్తాన్ తన రెండవ కుమారుణ్ణి కూర్చోమని ఆజ్ఞాపించాడు. అంటే, తన సింహాసనానికి ముహమ్మద్ ఇక వారసుడు కాడన్న మాట!

హఠాత్తుగా వేదిక కూలిపోయింది. ఎటువైపు చూసినా హా హా కారాలు చెలరేగాయి. గుమికూడిన జనం చుట్టూ దట్టమైన పొగలా ధూళి అవరించుకున్నది. కొంతసేపు ఏం జరిగిందీ ఎవరికీ అంతుబట్టలేదు. అరుపులూ, ధూళీ తగ్గాక సుల్తాన్, అతని రెండవ కుమారుడి దేహాలను శిథిలాల నుంచి వెలుపలికి లాగారు. ఇరువురూ ప్రాణాలు కోల్పోయారు. పాపం, ఘియాజుద్దీన్‌కు ఢిల్లీ నిజంగానే చాలా దూరంలో ఉండిపోయింది!

అదొక ప్రమాదవశాత్తు జరిగిన దుర్ఘటనా? ఆఫ్రికన్ యాత్రికుడు ఇబ్న్ బటూటా అలా భావించడం లేదు. ద్వారతోరణం, వేదిక రెండూ సుల్తానుకు పెట్టిన మరణ వలయాలుగానే ఆయన అభిప్రాయ పడుతున్నాడు.

ఢిల్లీ దూర్ అస్త్! (ఢిల్లీ చాలా దూరంలో ఉంది) అన్న మాట ప్రజల మధ్య సామెతగా మిగిలిపోయింది. దాదాపు సాధించామనుకున్న లక్ష్యం అనుకోకుండా అందకుండా పోయినప్పుడు ఈ సామెత చెబుతూ ఉంటారు. -(ఎం.డి)

## చందమామ క్విజ్-12 సమాధానాలు

1. 1875వ సం.లో.
2. గజరాజు.
3. స్వామి వివేకానంద, జనవరి 12.
4. యథార్థ చిత్రం.
5. తేనెచుక్క తెచ్చిన ప్రమాదం. వసుభాగుడి పంచతంత్రం.
6. అడ్వైత్యా-1. 255 సం.లు. కొల్‌కతాలోని అలిపూర్ జూలో.
7. విలువలకు సంబంధించిన విషయం! అలెగ్జాండర్, తత్వవేత్త డియోజినిస్.



# తథాస్తు దేవతలు

తన పొరుగునే ఉంటున్న రామేశాన్ని ఏదో విధంగా మించాలనుకుంటాడు కామేశం. తెలివితేటల్లోనూ, ఆస్తిపాస్తుల్లోనూ, మంచి తనంలోనూ పరోపకారం చేయడంలోనూ ఎదుటి వాళ్ళకన్నా, ముఖ్యంగా పొరుగింటి రామేశంకన్నా తాను ఎక్కువని చూపుకోవ డానికి కామేశం రకరకాలుగా ప్రయత్నిస్తూం టాడు. అయితే, ప్రతిసారీ అతనికి రామేశం చేతిలో భంగపాటే ఎదురవుతూ ఉండేది. రామేశానికి ఇక వెనక్కు రాదనుకున్న రెండు వేల వరహాల బాకీ వసూలయింది. అది తెలి సిన కామేశం తెగ అసూయపడ్డాడు.

ఆ సమయంలో కామేశం ఇంటికి భార్య తరపు దూరపు బంధువైన పొరుగూరి రైతు చంద్రయ్య వచ్చి, ''పట్నంలో మా అన్న కూతు రికి పెళ్ళి కుదిరింది. ఖర్చులకు వెయ్యి రూపా యలు తక్కువై నాకు కబురు పెట్టాడు. సమ యానికి నా దగ్గరా డబ్బులేదు. అప్పుచెయ్య కుండా అన్నను ఆదుకోవాలి కదా. నా దగ్గరున్న రెండువేల కొబ్బరి కాయల్ని-కాయ అర్ధ రూపాయి ప్రకారం అమ్మేస్తాను. నువ్వు కొను క్కుంటే మంచి లాభంతోపాటు, ఒక ఆడపిల్ల పెళ్ళికిఆదుకున్నసంతృప్తికూడా ఉంటుంది,'' అన్నాడు లౌక్యంగా.

సంతలో కొబ్బరి కాయలకు గిరాకీ లేక, చంద్రయ్య వాటిని తనకు అంటగట్టాలని, చూస్తున్నాడని వ్యాపారంలో ఘటికుడైన కామేశం గ్రహించాడు. అయితే, రామేశాన్ని దెబ్బతీయడానికి ఇదొక మంచి అవకాశమని భావించి, ''సమయానికి నా దగ్గరా డబ్బు లేదు. పరోపకారానికి మారుపేరైన మా పక్కింటి రామేశం నీకు సాయపడవచ్చు. రా, వెళదాం,'' అంటూ చంద్రయ్యను రామేశం ఇంటికి తీసుకువెళ్ళాడు.

అప్పుడక్కడ ఊరి పెద్దలు కొందరుంటే, రామేశం వారికి పరోపకారం గురించి చెబుతు న్నాడు. కామేశం చంద్రయ్యను రామేశానికి పరిచయం చేసి, ''నా దగ్గర డబ్బులేదు. నీ

దగ్గర డబ్బుందని తెలిసి ఇతన్నిలా తీసుకు వచ్చాను. సరుకు కొని మన ఊరి పరువు నిలబెట్టు,'' అన్నాడు.

అక్కడున్న పెద్దమనుషులకు కామేశం దురుద్దేశం అర్థమైంది. వాళ్ళల్లో ఒకాయన, ''ఇప్పుడు కొబ్బరి కాయలకు గిరాకీ లేదు. అలాంటప్పుడు రామేశం రెండువేల కాయలు కొని ఏం చేసుకుంటాడు?'' అన్నాడు.

అందుకు కామేశం నవ్వి, ''అలా ఆలోచిం చేది నువ్వూ, నేనూను. మన రామేశం పద్ధతే వేరు. తను ఈ సరుకు కొంటాడు. ఉద్దేశం మంచిది కాబట్టి, ఊహించనంత లాభం గడిస్తాడు,'' అన్నాడు రామేశాన్ని ఇరుకున పెట్టాలని.

రామేశం వెంటనే, ''పైన తథాస్తు దేవతలున్నారు. మంచి ఉద్దేశంతో మన కామేశం చెప్పిన మాటకు వారు తథాస్తు అన్నారు,'' అని చంద్రయ్యకు వెయ్యి వరహాలిచ్చి సరుకు కొనేశాడు.

ఇలా ఉండగా ఆ దేశపురాజు ప్రజాక్షేమానికి ఒక యాగం తలపెట్టాడు. అందుకు లక్ష కొబ్బరికాయలు కావాలి. స్వదేశంలో గిరాకీ లేక చాలామంది తమ సరుకును అయినకాడికి పొరుగు దేశాలకు అమ్ముకోవడంతో- రాజు కొబ్బరి కాయలను విదేశాల నుంచి దిగుమతి చేసుకోవలసి వచ్చింది. అవసరాన్ని గమనించి విదేశ వ్యాపారులు కాయ ధరను నాలుగు రూపాయలకు పెంచేశారు. రాజు మంత్రులను పిలిచి, ''మన అవసరానికి పొరుగుదేశం వ్యాపారులు ఎందుకు లాభపడాలి? కాయకు రెండు రూపాయలిస్తామని దేశమంతా చాటింపు వేయించండి. మన దేశం



వాళ్ళు తమ దగ్గరున్న సరుకు తెచ్చిచ్చాక, తక్కువయినవి మాత్రం విదేశాల నుంచి కొందాం. అలా అధికలాభం మన ప్రజలకే దక్కుతుంది,'' అన్నాడు.

మర్నాడు రాజుగారి చాటింపు విన్న ఊరి పెద్దమనుషులు రామేశం ఇంటికి వచ్చి ఆయన్ను అభినందించారు. ఆయనవెంటనే, ''ఇదంతా కామేశం నోటి చలవ. తనొక మంచి మాట అంటే తథాస్తు దేవతలు తథాస్తు అన్నారు,'' అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన కామేశం, ''పైకి తథాస్తు దేవతలు అంటాడు గానీ, రాజు చాటింపు గురించి రామేశానికి ముందే తెలుసు. బేరంలో పోటీకి వస్తామని మనకు చెప్పలేదు. లాభమంతా తనకే చెందాలని చంద్రయ్యకూ ఆ విషయం చెప్పలేదు,'' అన్నాడు ఉక్రోషంతో.

ఆ మాటకు అక్కడ చేరిన పెద్దమనుషులు నిర్విణ్ణులయ్యారు.

''నీ కుటిల బుద్ధి బయట పడకుండా, పది మందిలో మంచివాడనిపించుకోవడానికి ఏవో చెబుతున్నావుగానీ అసలు విషయం నీ ు ముందే తెలుసు,'' అన్నాడు కామేశం ఎ ఆవేశంగా రామేశంతో.

''అనవసరంగా ఆవేశపడకు కామేశం. అన్న కూతురి పెళ్ళికి సాయపడాలన్న అవసరంలో ఉన్న చంద్రయ్యను నా దగ్గరికి వెంటబెట్టుకు వచ్చింది నువ్వు. కొబ్బరి కాయలను కొనమని చెప్పింది నువ్వు. నేను అతన్ని వెతుక్కుని వెళ్ళి, రహస్యం దాచి సరుకు కొనలేదు కదా? అలాంటప్పుడు నాకెలా దురుద్దేశం అంటగడతావు?'' అన్నాడు రామేశం నెమ్మదిగా.

ఆ మాటకు కామేశం మరింత ఉక్రోషపడి ఏదో అనబోతూంటే చంద్రయ్య అక్కడికి వచ్చాడు. సరుకు అమ్మడంలో తనకు రాబోయే లాభాన్ని సమంగా పంచుకోవడానికి రమ్మని రామేశం కబురు పెట్టడం వల్లే, అతడక్కడికి వచ్చాడని తెలియడంతో కామేశానికి నోట మాట రాలేదు.

ఆ విధంగా కామేశం రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.



## తమిళనాడు జానపద కథ

# దొంగ బాబాయిలు!

పరమశివం తెలివైన కుర్రవాడు. చిన్నప్పుడే తల్లి దండ్రులు చనిపోవడంతో అమ్మమ్మ వాణ్ణి చేర దీసి ఆప్యాయంగా పెంచసాగింది. కొన్నాళ్ళకు వృద్ధురాలైన అమ్మమ్మ కంటిచూపు మందగించ సాగింది. అందువల్ల పరమశివమే ఇంటి పను లన్నీ చేసేవాడు.

పరమశివం దగ్గర్లో ఉన్న బడికి రోజు తప్ప కుండా వెళ్ళేవాడు. మధ్యాహ్నం వరకే బడి ఉండేది. వాడు తిరిగి వచ్చేలోగా అమ్మమ్మ వంట చేసి పెట్టేది. వాడు బడినుంచి తిరిగి వచ్చేంతవరకు తను తినేది కాదు. మనవ కు వచ్చాక ఇద్దరూ కలిసి సంతోషంగా భోజనం చేసేవారు. ఇంటి వద్ద అమ్మమ్మ కాచుకుని ఉంటుందని పరమ శివం బడి వదలగానే తిన్నగా ఇంటికి వచ్చేసేవాడు. వాణ్ణి చూసి అమ్మమ్మ ఎంతగానో మురిసిపోయేది.

ఒకనాడు పరమశివం బడినుంచి తిరిగి వచ్చినప్పుడు ఇద్దరు అపరిచిత వ్యక్తులు అమ్మమ్మతో మాట్లాడడం చూశాడు. వాణ్ణి చూడ గానే అమ్మమ్మ "పరమూ, మీ బాబాయిలు వచ్చారు చూడు," అంటూ పిలిచి వాళ్ళకు పరిచయం చేసింది. అందరూ కూర్చుని ముసలా



విడ వండిన వంటను తిన్నారు. ఆ వచ్చిన వ్యక్తులు అప్పుడప్పుడు తమలో తాము గుస గుసలాడుకోవడం పరమశివం గమనించాడు.

వాళ్ళు ఆ రోజంతా అక్కడే ఉన్నారు. రాత్రి కూడా అక్కడే గడిపారు. మరునాడు తెల్లవార గానే బయలుదేరబోతూ, "అత్తగారూ, మీకు అభ్యంతరం లేకపోతే పరమశివాన్ని మా వెంట తీసుకువెళ్ళి రెండు రోజుల తరవాత తెచ్చి వదిలి పెడతాం. మా గ్రామంలో ఉన్న మా తరఫు బంధువులు కూడా వాడికి తెలియడం మంచిది కదా," అన్నారు ముసలావిడతో.

అమ్మమ్మను ఒంటరిగా వదిలి వెళ్ళడానికి పరమశివానికి అసలు ఇష్టంలేదు. అయినా,



చెప్పి, వాళ్ళు తననూ, తన అమ్మమ్మనూ మోసం చేశారని గ్రహించాడు.

''కాదు. ఆ గ్రామం చేరుకోవడానికి ఇంకా కొంత దూరం నడవాలి. నువ్వు ఇక్కడే కూర్చుని ఆ బుట్టను జాగ్రత్తగా చూసుకో. మేము సంతకు వెళ్ళి, ఇప్పుడే వస్తాం,'' అన్నాడు ఒకడు.

మరొకడు పెట్టెను తీసి భుజాన పెట్టుకుని, ''బుట్టను తెరవొద్దు. అందులో అరుదైన పామును పట్టి బంధించాం. మన గ్రామానికి తీసుకువెళ్ళాలి,'' అని హెచ్చరించాడు.

ఆ తరవాత ఇద్దరూ గ్రామం కేసి వెళ్ళారు.

పరమశివం ఒక చెట్టు బోదె నానుకుని కూర్చున్నాడు. వెళ్ళిన వాళ్ళు ఎంతసేపటికీ రాలేదు. పరమశివానికి ఆకలి వేయసాగింది. ఒకవేళ వాళ్ళు రాకపోతే ఏం చేయాలి? తన గ్రామానికి ఒంటరిగా తిరిగి వెళ్ళడం ఎలాగా? అని ఆలోచించసాగాడు.

ఆమె వెళ్ళిరమ్మనడంతో వాళ్ళ వెంట బయలు దేరాడు.

కొంతదూరం వెళ్ళాక, ఆ ఇద్దరు తమ వద్ద ఉన్న బుట్టనూ, పెట్టెనూ పరమశివాన్ని మోసుకు రమ్మన్నారు. పరమశివం బుట్టను తల మీద పెట్టుకున్నాడు. పెట్టెను ఒక చేత్తో పట్టుకు న్నాడు. రెండూ బరువుగానే ఉన్నాయి. అయినా వాళ్ళకు ఎదురుచెప్పకుండా వాటిని మోసు కుంటూ పరమశివం వాళ్ళవెంట నడవసాగాడు.

మరికొంత దూరం నడిచాక ఒక గ్రామం కనిపించడంతో, ''ఇదేనా మన బంధువులున్న గ్రామం?'' అని అడిగాడు పరమశివం.

ఆ ఇద్దరూ ఒకరినొకరు చూసుకుంటూ హేళనగా నవ్వుకోవడం గమనించిన పరమశి వంలో వారిపట్ల అంతవరకు ఉన్న అనుమానం మరింత బలపడింది. తన తండ్రికి తమ్ముళ్లమని

బుట్టలో ఏముందో చూడాలన్న ఉత్సుకత కొద్దీ, మెల్లగా బుట్ట మూతను కొద్దిగా తెరిచి చూశాడు. పాము ఉన్నట్టు కనిపించలేదు. పైన చక్కగా మడిచిన మెత్తటి బట్ట కనిపించింది. దాని అడుగున పాము ఉంటుందో ఏమో అని లేచి నిలబడి బుట్టను కాలితో కదిలించి దూరంగా వెళ్ళాడు. ఎలాంటి పామూ బయ టకు రాలేదు. వాడు బుట్ట వద్దకు వెళ్ళి, మెల్లగా మూత తొలగించి బట్టను పైకెత్తి చూశాడు. లోపల తినుబండారాలు, ఘుమ ఘుమలాడే పిండివంటలు ఉన్నాయి!

''ఆహా, ఆకలి తీర్చుకోవడానికి కావలసి నన్ని పిండివంటలున్నాయి! నన్ను మోసపుచ్చ డానికే వాళ్ళు బుట్టలో అరుదైన పాము ఉందని చెప్పారన్న మాట! ఇంకా ఎంతసేపని వాళ్ళ

కోసం ఎదురుచూడడం?'' అనుకుంటూ అందులో నుంచి కొంత తీసుకుని తిని, బుట్టను మునుపటిలాగే గట్టిగా మూసి పెట్టాడు. మరి కొంతసేపయ్యాక, బుట్టను చెట్టుబోదె వద్ద వదిలిపెట్టి, పరమశివం తన గ్రామం కేసి తిరుగుప్రయణమయ్యాడు.

కొంత దూరం వెళ్ళే సరికి ఒక నది కని పించింది. వాడు నదీ తీరం గుండా నడవ సాగాడు. ఇంకా కొంత దూరం వెళ్ళేసరికి, ఇద్దరు భటులు ఎదురు పడ్డారు. వాళ్ళు పరమశివాన్ని చూసి ఆగి, ''ఎవరు నువ్వు? నీది ఏ ఊరు?'' అని అడిగారు.

''నా పేరు పరమశివం. ధర్మపురి సమీపం లోని శివగిరి మా గ్రామం. మా అమ్మమ్మతో కలిసి ఉంటాను. మా బాబాయిలిద్దరు వచ్చి, వాళ్ళ గ్రామానికి పిలిస్తే, వాళ్ళ వెంట బయలు దేరాను. వాళ్ళు నన్ను ఒక చోట వదిలి ఏదో ముఖ్యమైన పని ఉందని వెళ్ళారు. ఎంతకూ తిరిగి రాకపోయేసరికి నేను మా గ్రామానికి తిరిగి వెళుతున్నాను,'' అన్నాడు కుర్రవాడు.

''మేము రాజుగారి భటులం. ఇద్దరు దొంగలు రాజభవనంలోని ఆభరణాలను దొంగి లించుకుని పారిపోయారు. మేము వాళ్ళను వెతుక్కుంటూ వస్తున్నాం. ఆ దొంగలు నీకే మైనా కనిపించారా?'' అని అడిగారు వాళ్ళు.

''మా బాబాయిల్ని తప్ప నేనెవ్వరినీ చూడ లేదు,''అంటూ కాస్సేపు ఆలోచించిన పరమ శివం, ''అయినా, మీరు చెబుతున్నది వింటూంటే, వాళ్ళిద్దరూ ఆ దొంగలేమో అన్న అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు.

ఆ తరవాత పరమశివం వాళ్ళిద్దరూ బాబా యిలమంటూ వచ్చి, తనను పిలిచిన విష యమూ, వాళ్ళ వద్ద ఉన్న పెట్టె, బుట్ట సంగతీ వివరించాడు.

''బహుశా, వాళ్ళు దొంగలే అయివుంటారు. వాళ్ళు నిన్ను వదిలి వెళ్ళిన చోటికి వెళదాంపద. ఒకవేళ వాళ్ళు అక్కడికి తిరిగివచ్చి నీ కోసం ఎదురు చూస్తూ ఉండవచ్చు,'' అన్నారు భటులు.

పరమశివం భటులను వెంట బెట్టుకుని వెనక్కు తిరిగాడు. తాను బుట్టతో కూర్చున్న చోటును సమీపిస్తూండగా, ఇద్దరు మనుషులు చెట్టుకింద కూర్చుని ఉండడం కొద్ది దూరం నుంచే గమనించి ఆగాడు.

''పరమశివం, నువ్వు ముందుగా వెళ్ళి, వాళ్ళతో ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ ఉండు. మేము వెనకగా వచ్చి వాళ్ళను పట్టు కుంటాం. ఒకవేళ వాళ్ళు మేము వెతికే దొంగలు





లేదు. పిండివంటలున్నాయి. అందులో పాము ఉందని నాతో అబద్ధం చెప్పారు కదూ?'' అన్నాడు పరమశివం ధైర్యంగా.

ఆ ఇద్దరూ పరమశివం దగ్గరికి వచ్చారు. ఒకడు వాడి చేయిని వడిసి పట్టుకున్నాడు. రెండవవాడు కొట్టబోయాడు. పరమశివం విడిపించుకోవడానికి ప్రయత్నించాడు. ఆ పెనుగులాటలో తమకు వెనకగా వచ్చిన భటులను ఆ ఇద్దరు గమనించలేదు. భటులు వాళ్ళను పట్టుకుని పెడరెక్కలు విరిచికట్టారు. ''రాజుగారి ఆభరణాలతో పారిపోయిన దొంగలు మీరేకదా? వాటిని ఎక్కడ దాచారో చెప్పండి,'' అని గద్దించి అడిగాడు ఒక భటుడు కోపంగా.

నిజం చెప్పక తప్పదని గ్రహించిన దొంగలు, ''ఒక వడ్డీ వ్యాపారికి అమ్మేశాం,'' అన్నారు ఒక్కసారిగా.

భటులు వాళ్ళను వడ్డీ వ్యాపారి వద్దకు లాక్కెళ్ళారు. దొంగలు తమ వద్ద ఉన్న డబ్బిచ్చి, నగలను తీసి భటులకు అప్పగించారు.

ఆ ఇద్దరి దొంగలకూ కారాగార శిక్ష విధించిన రాజు, దొంగలను పట్టుకోవడంలో భటులకు సాయపడిన పరమశివాన్ని అభినందించి కానుకలిచ్చాడు.

ఆ తరవాత భటులు పరమశివానికి తోడుగా వెళ్ళి, వాణ్ణి ఇంటి వద్ద వదిలి వచ్చారు. జరిగినదంతా పరమశివం అమ్మమ్మకు వివరించాడు. అమ్మమ్మ మనవణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకుని, ''నిజంగానే, నీ బాబాయిలని నమ్మి ఆ దొంగల వెంట నిన్ను పంపాను. మతిలేని దాన్ని. అయినా ఇద్దరు దొంగలను ధైర్యంగా ఎదుర్కొని, భటులకు పట్టిచ్చిన నీ తెలివి చాలా గొప్పది,'' అంటూ మురిసిపోయింది.

కానిపక్షంలో వదిలేద్దాం,'' అన్నాడు ఒక భటుడు. సరేనని పరమశివం ముందుకు నడిచాడు. వాణ్ణి దూరం నుంచి చూడగానే, ఆ ఇద్దరిలో ఒకడు, ''అదిగో! ఆ తుంటరి వెధవ ఇప్పుడు వస్తున్నాడు,'' అని అరిచాడు.

''ఎక్కడికి వెళ్ళి వస్తున్నావు?'' అని అడిగాడు రెండవవాడు కోపంగా.

''మీ కోసం చాలాసేపు ఎదురుచూశాను. మీరు ఎంత సేపటికీ రాకపోయేసరికి మిమ్మల్ని వెతుక్కుంటూ అలా వెళ్ళి వస్తున్నాను. చాలా ఆకలిగా ఉంది,'' అన్నాడు పరమశివం అమాయకంగా.

''బుట్టనెందుకు తెరిచావు?'' అని అడిగాడు మొదటివాడు.

''ఆ పాము ఎలా ఉంటుందో చూద్దామని కొద్దిగా తెరిచి చూశాను. అందులో పాము



# నరకవాసి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఆ నగరంలో ధనికుడైన ఒక గొప్ప వర్తకుడుండేవాడు. ఆయనకు మిత్రవిందకుడని ఒక కొడుకుండేవాడు. ఈ మిత్రవిందకుడు ఎంతో పాపాత్ముడు. వర్తకుడు చనిపోయాక, ఆయన భార్య తన కుమారుడికి, ''నాయనా, ఇకనైనా సత్ప్రవర్తన అలవరుచుకో. దానాలు చెయ్యి; నియమాలు పాటించు; ధర్మం అనుసరించు!'' అని ఎంతో హితబోధ చేసింది. కాని వాడు తల్లి మాటలు కొంచెమైనా వినిపించుకోలేదు.

ఇంతలో కార్తీక పౌర్ణమి వచ్చింది. మిత్రవిందకుడితో అతని తల్లి, ''నాయనా, ఇవాళ పుణ్యదినం. తెల్లవార్లూ విహారంలో ధర్మోపదేశం చేస్తారు. నువ్వు అక్కడ అందరితో పాటు పూజ చేసుకుని, ఉపదేశం విని రా. తిరిగి వచ్చాక నీకు వెయ్యి రూపాయలిస్తాను,'' అన్నది.

డబ్బుకోసమని మిత్రవిందకుడు సరేనన్నాడు.

అతను ఉపదేశం వినటానికి విహారానికి వెళ్ళాడు గాని, ఒకమూల పడుకుని హాయిగా నిద్రపోయాడు. తెల్లవారుతూనే లేచి హడావుడిగా ముఖం కడుక్కుని ఇంటికి తిరిగి వచ్చాడు. తన కొడుకు ధర్మబోధకుణ్ణి వెంటబెట్టుకుని వస్తాడనే ఉద్దేశంతో అతని తల్లి ఎంతో సంతోషంగా వంటచేసి సిద్ధంగా వుంది. కొడుకు ఒంటరిగా రావటం చూసి, ''ధర్మబోధకుణ్ణి తీసుకురాలేదా, నాయనా?'' అని అడిగింది.

''ఆయనను ఇక్కడికి తీసుకురావటం దేనికమ్మా? నా కాయనతో పని లేదు!'' అన్నాడు మిత్రవిందకుడు.

అతను భోజనం చేసి తల్లి దగ్గిర వెయ్యి రూపాయలు తీసుకుని తన పని మీద తాను వెళ్ళాడు. ఈ డబ్బుతో అతను బాగా వ్యాపారం



చేసి అతి త్వరలోనే ఇరవై లక్షల రూపాయలు సంపాదించుకున్నాడు.

ఈ డబ్బు పెట్టుబడి చేసి సముద్ర వ్యాపారం సాగిస్తాను; ఇంకా ఎక్కువ డబ్బు సంపాదిస్తాను; అనుకున్నాడు మిత్రవింద కుడు. అతను ఒక పడవ కొని దానిలో సరుకులు ఎక్కించి, సముద్రాల మీద బయలు దేరుతున్నానని చెప్పిపోవటానికి, తల్లి వద్దకు వచ్చాడు.

అంతా విని తల్లి కంటతడి పెట్టి, ''నాయనా, నాకు నీవొక్కడవే కొడుకువు! నీ దగ్గిర ఇంత డబ్బున్నది గదా. ఇంకా డబ్బు సంపాదించి ఏం చేసుకుంటావు? సముద్ర ప్రయాణం క్షేమం కాదు. నిన్ను వదిలి నేను ఉండలేను. నా మాట విని ఈ ప్రయాణం మానుకో, ఇంటి పట్టున వుండు!'' అన్నది.

మిత్రవిందకుడు తల్లి మాట వినక, పోయి తీరాలని మూర్ఖించాడు.

ఆవిడ చెయ్యి పట్టుకుని వెళ్ళవద్దని ఎంతగానో బతిమాలింది. అతడు ఆగ్రహంతో తల్లిని కొట్టి, తన చేతిని విడిపించుకుని వెళ్ళి పోయాడు.

ఆ రోజే అతని పడవ బయలుదేరింది. ఏడు రోజులపాటు ప్రయాణం సరిగానే సాగింది. కాని ఎనిమిదవ రోజున నడి సముద్రంలో పడవ ఎటూ కదలక ఆగిపోయింది. ఈ దుర్ఘటనకు కారకులెవరో పడవలోనేవున్నారనే ఉద్దేశంతో నావికులు చీటీవేశారు. చీటీ మిత్రవిందకుడికి వచ్చింది. నావికులు మూడు సార్లు చీటీ వేశారు. మూడు సార్లూ అది మిత్రువిందకుడికే వచ్చింది.

నావికులు మిత్రవిందకుడికి, ఒక తెప్ప ఇచ్చి దాని మీద అతణ్ణి వుంచారు. మరు క్షణం పడవ శరవేగంతో ముందుకు వెళ్ళి పోయింది.

కాలక్రమాన మిత్రవిందకుడు తన తెప్ప మీద ఒక లంకకు చేరుకున్నాడు. ఆ లంకలో అతని కొక స్ఫటికభవనం కనబడింది. అందులో నాలుగు ఆడపిశాచాలు కాపురం వుంటున్నాయి. ఈ పిశాచినులు వారం రోజులు సరదాగా గడుపుతాయి; మరి వారం రోజులు అవి పాప ప్రాయశ్చిత్తం కోసం కఠోరమైన నియమాలు అవలంబిస్తాయి. మిత్రవింద కుడు ఆ పిశాచినులతో ఒక వారం పాటు ఇంద్రవైభోగాలు అనుభవించాడు. పిశాచి

నులు వ్రతం ఆరంభించేసరికి అతనికి అక్కడ వుండబుద్ధి కాలేదు. అతను తన తెప్ప మీద తిరిగి బయలుదేరాడు.

అతను సముద్రం మీద వెళ్ళగా వెళ్ళగా మరొక లంక తగిలింది. దానిలో ఎనిమిది మంది పిశాచినులున్నారు. మిత్రవిందకుడు వారితో కూడా వారం రోజులు గడిపి, వారు కఠోరవ్రతాలు ఆరంభించగానే మళ్ళీ తెప్ప మీద బయలుదేరాడు.

ఈ విధంగా అతను మరొక దీవిలో పదహారు మంది పిశాచినులతోనూ, ఇంకొక దీవిలో ముప్పైరెండు పిశాచినులతోనూ ఒక్కొక్క వారం గడిపి, ఆఖరుకు తన తెప్పపైన వేరొక లంకను చేరుకున్నాడు. ఈ లంకలో ఒక పెద్ద నగరం వున్నది. దాని చుట్టూ గోడా, ఆ గోడలో నాలుగు ద్వారాలూ వున్నాయి. అది ఉస్సదనరకం. అయితే, మిత్రవిందకుడికి అది నరకంలాగా కనిపించలేదు. అందమైన నగరం లాగా కనబడింది. ''నేనీ నగరంలో ప్రవేశించి దీనికిరాజునవుతాను!'' అనుకున్నాడతను.

నగరంలో ఒక చోట మిత్రవిందకుడికి ఒక మనిషి కనిపించాడు. ఆ మనిషి తన నెత్తిన అసిధారాచక్రం మోస్తున్నాడు. దాని అంచు పదునుగా వుండటం వల్లనూ, అది చాలా బరువైనది గనకనూ, ఆ చక్రం అతని తలలోకి దిగబడిపోయింది. తల నుంచి రక్తం ధారలుగా కారుతున్నది. ఆ మనిషి శరీరం అయిదు పేటల గొలుసుతో బంధించబడి వున్నది. అతను బాధతో దీనంగా మూలుగుతున్నాడు.



ఇదంతా కళ్ళారా చూస్తూ కూడా మిత్రవిందకుడు ఆ మనిషి ఆ నగరానికి రాజని భ్రమపడ్డాడు. అసిధారాచక్రం మిత్రవిందకుడి కళ్ళకు పద్మంలాగా కనబడింది; అతని వంటి మీది గొలుసు అలంకార భూషల లాగా తోచింది; అతని మూలుగు గంధర్వ గానంలాగా వినిపించింది.

మిత్రవిందకుడు ఆ నరకవాసిని సమీపించి, ''అయ్యా, తమరు చాలాకాలంగా ఆ పద్మాన్ని శిరస్సున ధరించారు. నన్ను కూడా ధరించనివ్వండి!'' అని అడిగాడు.

''బాబూ, ఇది పద్మం కాదు, అసిధారా చక్రం!'' అన్నాడు నరకవాసి. ''చూశావా? నాకివ్వటం ఇష్టంలేక ఆ మాట అంటున్నావు!'' అన్నాడు మిత్రవిందకుడు.

''నేటితో నా పాపానికి పరిహారం అయిపోయినట్టుంది. వీడు కూడా నాలాగే తల్లిని కొట్టినవాడై ఉంటాడు. పాపఫలం అనుభవించటానికే వీడిక్కడికి చేరివుంటాడు!''అని అనుకుని నరకవాసి తన నెత్తి మీద వున్న అసిధారాచక్రాన్ని, మిత్రవిందకుడి నెత్తిన పెట్టి, సంతోషంగా తన దారిన తాను వెళ్ళిపోయాడు.

అప్పుడు స్వర్గంలో ఇంద్రుడుగా వుంటున్న బోధిసత్వుడు దేవగణాలను వెంటబెట్టుకుని నరకాలన్నిటినీ తణిఖీ చేస్తూ కొంతకాలానికి మిత్రవిందకుడుండే చోటికి వచ్చాడు.

అయనను చూడగానే మిత్రవిందకుడు ఏడుస్తూ, ''స్వామీ, కరుణించండి! ఈ చక్రం నన్నెప్పుడు వదులుతుందో చెప్పండి!'' అని వేడుకున్నాడు.

అప్పుడు ఇంద్రుడు, మిత్రవిందకుడికి ఈ విధంగా జవాబు చెప్పాడు:

''నీకు ఎంత డబ్బున్నా ఇంకా కావాలని కోరావు. పిశాచినులతో కాలక్షేపం చేశావు. మానవుడు నడవదగిన ఉన్నత మార్గాలు నీకు నచ్చలేదు. ఇతరులు నీ మేలుకోరి చెప్పిన సలహా వినక ఈ చక్రాన్ని కోరి నెత్తికి తెచ్చుకున్నావు! నువ్వు బతికివున్నంతకాలమూ ఆ అసిధారా చక్రం నిన్ను వదలదు.''

మిత్రవిందకుడు తనకు పట్టిన దుర్దశ తెలుసుకుని, విచారంతో కుంగిపోయాడు.





# రామాయణం

భరతుడు రాముడి ఆజ్ఞానుసారం లేచి జలం స్పృశించి రాముణ్ణి తాకి అందరితోనూ ఈ విధంగా అన్నాడు : ''మీరంతా వినండి. నేను నా తండ్రిని రాజ్యం కోరలేదు, నా తల్లినీ కోరలేదు. రాముడడవికి వెళ్ళటం నాకు సమ్మతంకాదు. రాముడిబదులు నేనుపద్నాలుగేళ్ళూ వనవాసం చేస్తాను; నాకు బదులు రాముణ్ణి రాజ్యం చెయ్యమనండి. తండ్రి ఆజ్ఞ పాలించినట్టవుతుంది.''

ఈ మాటలు విని రాముడు నిర్ఘాంతపోయి, ''ఇలా రాజ్యాన్ని, వనవాసాన్ని మార్పు చేసుకోవటం పితృవాక్య పరిపాలన ఎలా అవుతుంది? నేను వనవాసం చెయ్యటం మాని రాజ్యం ఏలటం కన్న ఘోరమైన తప్పు ఉండదు. ఈ పద్నాలుగేళ్ళూ పూర్తికాగానే నేనూ, భరతుడూ కలిసి రాజ్యంచేస్తాం,'' అన్నాడు.

చుట్టూ చేరిన వారు రాముడి మాటలకూ, భరతుడి మాటలకూ కూడా సంతోషించారు. వారు భరతుడితో, ''నాయనా, రాముడు చెప్పినట్టు చెయ్యి, అతన్ని తండ్రి రుణం తీర్చుకోనీ!'' అన్నారు.

రాముడు సంతోషించాడు గాని భరతుడి గుండెలో రాయిపడింది. చివరకతను రాముణ్ణి పాదుకలిమ్మని అడిగాడు.

రాముడు ఆ పాదుకలను కాళ్ళకు వేసుకుని భరతుడికి ఇచ్చాడు.

భరతుడు రాముడితో, ''నువ్వు కాకపోతే నీ పాదుకలే లోకాన్ని రక్షిస్తాయి. నేను ముని వేషంతో, ఫల మూలాలు తింటూ, రాజ్య భారం ఈ పాదుకలకు అప్పగించి, ఊరి బయట ఉండి నీ రాక కోసం నిరంతరం ఎదురు చూస్తూ ఉంటాను. పద్నాలుగేళ్ళూ దాటిన మర్నాడు నువ్వు రాకపోయావో,



మరుక్షణమే తప్పక అగ్నిప్రవేశం చేస్తాను,'' అన్నాడు వినయంగా.

రాముడిందుకు సరేనని, భరతుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, ''నీ తల్లిని రక్షించు. ఆమె మీద ఆగ్రహించావో నా మీదా, సీత మీదా ఒట్టు! ఇకవెళ్ళి రా,'' అంటూ కన్నీరు కార్చాడు.

భరతుడు బంగారు అలంకారాలు గల రామపాదుకలను పూజించి, రాముడికి భక్తితో ప్రదక్షణం చేశాడు.

తరవాత రాముడు తన తల్లులనూ, ఇతరులనూ అక్కడి నుంచి సాగనంపి పర్ణశాలకు తిరిగివచ్చాడు.

భరతుడు రాముడి పాదుకలను నెత్తిన పెట్టుకుని, శత్రుఘ్నుడితో సహా రథమెక్కాడు. వసిష్ఠ నామదేవ జాబాలి మొదలైన వారు ముందు సాగారు.

భరతుడు సపరివారంగా తిరుగుప్రయాణంలో భరద్వాజాశ్రమానికి వచ్చాడు. ఆయనతో జరిగినదంతా చెప్పి, ఆయన వద్ద సెలవు పుచ్చుకున్నాడు. శృంగిబేరపురం మీదుగా ప్రయాణించి అతను చివరకు అయోధ్య చేరుకున్నాడు.

అయోధ్య వీధుల గుండా రథ మెక్కి వస్తూంటే అతనికి నగరం నిర్జీవంగా కనబడింది. అతను శత్రుఘ్నుడితో, ''అయోధ్య కళఅంతా రాముడితోనే పోయింది,'' అన్నాడు.

భరతుడు తన తల్లులను అయోధ్యకు తెచ్చి వసిష్ఠుడు మొదలైన వారితో, ''రాముడు లేని అయోధ్యలో ఉండలేను, నందిగ్రామానికి పోయి, అక్కడినుంచే రాజ్యం చేస్తూ రాముడి రాకకు ఎదురుచూస్తూ ఉంటాను,'' అన్నాడు.

ఈ ఏర్పాటుకు మంత్రులు కూడా సమ్మతించారు. భరతుడు తల్లుల దగ్గిర సెలవు పుచ్చుకుని, శత్రుఘ్నుడితో బాటు రథమెక్కి, మంత్రులనూ, వసిష్ఠుణ్ణీ వెంటబెట్టుకుని నందిగ్రామానికి బయలుదేరాడు.

తన వెంట రమ్మని అతను ఆజ్ఞాపించకపోయినప్పటికీ సేనకూడా అతని వెంట నందిగ్రామానికి కదిలింది.

నందిగ్రామంలో పాదుకలకు శ్వేతచ్ఛత్రమూ ఇతర రాజమర్యాదలూ జరగాలని భరతుడు ఉత్తరు విచ్చాడు. తన తల్లి మూలంగా తనకు కలిగిన అపకీర్తి పోగొట్టుకోవటానికి మహాత్ముడైన భరతుడు జడలు ధరించి, నారబట్టలు కట్టి, మునివేషం వేసుకుని నందిగ్రామంలో ఉండి కోసలదేశాన్ని

పరిపాలించాడు. రాజతంత్రం ప్రతిదీ ఆ పాదుకలకు చెప్పుకునేవాడు. సామంతులు తెచ్చిన కానుకలను పాదుకలకు భక్తితో నైవేద్యం పెట్టేవాడు. రాముడికి జరగవలిసిన పట్టాభిషేకం ఈ విధంగా రామ పాదుకలకు జరిగింది.

భరతుడు వెళ్ళినాక రాముడు కొంత కాలం ఆ పర్ణశాలలోనే ఉన్నాడు. క్రమంగా అతనికి ఒక విషయం తెలిసివచ్చింది: ఆ ప్రాంతంలో ఉండే ఆశ్రమాలకు చెందిన మునులు రాముణ్ణి చూపించి ఏవో గుసగుస లాడుకుంటున్నారు. దీనికి తోడు వారంతా తమ ఆశ్రమాలు విడిచి వెళ్ళిపోతున్నారని కూడా తెలిసింది.

ఇదంతా ఏమిటో తేల్చుకోవాలనుకుని రాముడు మునులకు కులపతి అయిన వృద్ధ ముని వద్దకు వెళ్ళి, ''మీరంతా ఆశ్రమాలు విడిచిపోతున్నారట. నేనుగాని, నా తమ్ముడుగాని, నా భార్యగాని తెలియక చేయగూడని పని ఏదైనా చేయలేదు గద?'' అని అడిగాడు.

దానికి కులపతి, ''మీరేమీ చెయ్యలేదు గాని, నీ కారణంగా రాక్షసులు మునులకు మహాభయం కలిగిస్తున్నారు. రావణుడి తమ్ముడు ఖరుడనే వాడు జనస్థానంలో చేరి అక్కడి మునులను పారదోలాడు. ఎప్పుడో మాకూ పీడ చుట్టుకుంటుంది. అందుచేత ఈ ప్రాంతం వదిలి పోవాలనుకుంటున్నాం. యోధుడివి, అందులోనూ భార్యతో ఉంటున్న వాడివి; నీకైనా ఈ చోటు వదలటమే మంచిది,'' అన్నాడు.



తరవాత అక్కడి మునులు చాలా దూరాన ఉండే మరొక ఆశ్రమానికి బయలుదేరి వెళ్ళిపోయారు.

రాముడు మాత్రం మరి కొంతకాలం అక్కడే ఉండి తాను కూడా ఆ ప్రాంతం విడిచి పెడితే మంచిదని నిశ్చయించుకున్నాడు. ఆ ప్రకారమే అతడు సీతాలక్ష్మణులతో బయలుదేరి అత్రిమహాముని ఆశ్రమానికి వెళ్ళాడు. ఆయన వారిని తన బిడ్డలలాగా ఆదరించి, తానే స్వయంగా వారికి అతిథి సత్కారాలు చేశాడు.

తరవాత అత్రిమహాముని కుటీరం లోపల ఉన్న జగద్విఖ్యాతురాలైన తన భార్య అనసూయను పిలిచి, ఆమెకు రామలక్ష్మణులనూ, సీతనూ పరిచయం చేశాడు. అనసూయ ఇప్పుడు చాలా వృద్ధురాలు. జుట్టంతా బాగా తెల్లబడిపోయింది. అవయవాలు సడలి



పోయాయి. కాని ఆమె తపశ్శక్తి మాత్రం సాటిలేనిది.

అత్రిమహాముని రాముడితో, ''అనసూయ తన తపశ్శక్తితో ఎన్నెన్నో మహిమలను చేసి చూపింది. ఒకప్పుడు వర్షంలేక పదేళ్ళపాటు కరువువస్తే ఈమె తన తపశ్శక్తితో గంగను ప్రవహింప జేసి మునులకు ఫల మూలాలు ఉత్పత్తి అయేటట్టు చేసింది. పది రాత్రులు ఒకే రాత్రిగా ఉండేలాగ మరొక సందర్భంలో చేసింది. సీతను ఈమెకు నమస్కారం చెయ్యమను,'' అన్నాడు.

రాముడు సీతతో, ''ఈ మహాత్ముడి మాట విన్నావు కదా. మహా తపస్సంపన్నురాలు అయిన అనసూయాదేవికి నమస్కరించు. అందువల్ల నీకు శ్రేయస్సు కలుగుతుంది,'' అన్నాడు.

సీత అనసూయకు తన పేరు చెప్పుకుని అమిత గౌరవంతో నమస్కారం చేసి ఆమెను కుశల మడిగింది.

అనసూయ సీతను చూసి ఎంతో ముచ్చట పడి మందహాసం చేస్తూ, ''తల్లీ, నువ్వు బంధువులనూ, ఐశ్వర్యాన్నీ, అహంకారాన్నీ, సమస్తాన్నీ విడిచి భర్త వెంట పాతివ్రత్య ధర్మంగా అరణ్యాలకు వచ్చావే, నీ భాగ్యమే భాగ్యం! అమ్మా, నేను ఎంతగానో ఆలోచించి చూశాను, స్త్రీని సమస్తవేళలా భర్తలాగా రక్షించేవారు మరెవరూలేరు. నువ్విలాగే భర్తను అనుసరించి ఉంటూ పాతివ్రత్య ధర్మం నెరవేర్చు,'' అని చెప్పింది.

''నా భర్త గుణవంతుడు, దయామయుడు, ధర్మాత్ముడు, నా మీద అచంచలమైన ప్రేమగలవాడు, నాకు తల్లి వంటి వాడు,

తండ్రి వంటివాడు, మోహనాకారుడు; అటు వంటి భర్తను సేవించటానికేం? నేను చిన్నతనం నుంచీ పతివ్రతా ధర్మాలు తెలుసుకున్నాను. అడవికి వచ్చేటప్పుడు నా అత్త కౌసల్య కూడా నాకా ధర్మం బోధించింది. ఇప్పుడు మీ నోట కూడా అవే వింటున్నాను,'' అన్నది సీత ఎంతో వినయంగా.

సీత తియ్యగా మాట్లాడుతూంటే అనసూయకు ఎంతో ముచ్చట అయింది. ఆమె సీతతో, ''అమ్మా, నీకేమైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీర్చుతాను,'' అన్నది.

సీత ఈ మాట విని ఆశ్చర్యపడి, ''మీరా మాట అనటమే నాకు పదివేలు,'' అని సమాధాన మిచ్చింది.

''అయినా నా సంతోషం కొద్దీ ఇచ్చేది నువ్వు తీసుకోవాలి,'' అంటూ అనసూయ సీతకు ఒక దివ్యమైన పుష్పమాలా, ఒక చీరా, కొన్ని అందమైన ఆభరణాలూ, శరీరానికి పూసుకునే పూతా, మంచి పరిమళగంధమూ ఇచ్చింది.

తరవాత అనసూయ సీతతో, ''నీ భర్త నిన్ను స్వయంవరంలో పెళ్ళాడాడని విన్నాను. ఆ కథంతా చెబుతావా, అమ్మా?'' అని అడిగింది.

సీత తన వృత్తాంతమంతా అనసూయకు చెప్పింది: ''మా తండ్రి జనకమహారాజు మిథిలకు రాజు. ఆయన యాగం కోసం నాగలితో భూమిని దున్నుతూ ఉండగా మట్టిలో నేనాయనకు దొరికాను. ఆయన కప్పటికి సంతానం లేకపోవటం చేత నన్ను తన కుమార్తెగా భావించి, పెంచమని తన పెద్ద భార్యకిచ్చాడు. నాకు పెళ్ళియీడు వచ్చాక ఆయ



నకు పెద్ద విచారం పట్టుకున్నది. ఎంత ఆలో చించినా నాకు తగిన భర్త ఆయనకు దొరక లేదు. అప్పుడాయన నాకు స్వయంవరం చేద్దామని నిశ్చయించి, తన ఇంటనున్న గొప్ప విల్లును ఎక్కుపెట్టిన వాడికి నన్నిచ్చి పెళ్ళి చేయ నిర్ణయించాడు. ఎందుకంటే, దైవాంశ ఉన్నవారు తప్ప మామూలు మనుషులు దానిని ఎత్తనైనా శక్తిలేని వారవుతారు. ఎందరో రాజులు స్వయంవరానికి వచ్చి, ధనుస్సును ఎత్తలేక దణ్ణంపెట్టి వెళ్ళిపోయారు. అంతలో విశ్వామిత్రమహాముని రామలక్ష్మణులతో సహా యజ్ఞం చూడవచ్చాడు. విశ్వామిత్రుడు కోరగా మా తండ్రి ఆ ధనుస్సును తెప్పించి వారికి చూపాడు. రాముడా ధనువును అవలీలగా ఎత్తి, తాడు తగిలించి లాగేసరికి ధనుస్సు పెళపెళా నడిమికి విరిగిపోయింది. వెంటనే నా తండ్రి కన్యాదానం చెయ్యటానికి జలకలశం తెప్పించాడు. కాని రాముడు తన తండ్రి అనుమతి లేకుండా నన్ను పెళ్ళాడనన్నాడు. తరవాత మా తండ్రి అయోధ్యకు కబురు చేసి దశరథ మహారాజును రప్పించిన తరవాత మాకిద్దరికీ పెళ్ళి జరిగింది.''

ఈ కథ విని అనసూయ ఎంతో సంతోషించింది. ఆమె సీతను తన ఎదుటనే అలంకరించుకోమని చెప్పి, తరవాత ఆమెను రాముడి వద్దకు పంపింది.

రాముడు అందమైన ఆమె అలంకరణలన్నీ చూసి, ''ఇవన్నీ ఎక్కడివి?'' అని అడిగితే అనసూయ ఇచ్చిన కానుకలని సీత చెప్పింది. రామలక్ష్మణులు పరమానందం పొందారు.

సీతారామలక్ష్మణులు ఆ రాత్రి అత్రి మహాముని ఆశ్రమంలో గడిపి, మర్నాడు సూర్యోదయం వేళ అత్రిమహాముని వద్ద సెలవు తీసుకున్నారు.

''నాయనా, ఈ అరణ్యంలో కొందరు నరభక్షకులైన రాక్షసులు కూడా ఉన్నారు. మునులు ఫలాల కోసం అడవికి వెళ్ళి వచ్చేదారి చూపుతాను, ఆ దారినే వెళ్ళండి,'' అని అత్రి చెప్పాడు.

ఆయన చూపిన మార్గాన బయలుదేరి సీతారామలక్ష్మణులు భయంకరమైన దండకారణ్యం ప్రవేశించారు.

[అయోధ్యాకాండ సమాప్తం]





# రాణి - దాసి

వైశాలీనగరంలో హీరాదత్తుడికి లేక లేక నలభై ఏళ్ళ వయసులో ఒక బంగారుబొమ్మ లాటి కూతురు పుట్టింది. ఆ బిడ్డను చూసుకుని హీరాదత్తుడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

అయితే అతని ఆనందం త్వరలోనే తీరని దుఃఖంగా మారింది. ఆ చంటి పిల్లను ఒక నాడు చల్లగాలికి తొట్టెతోసహా ఆరుబయట పడుకోబెట్టారు. ఇంతలో ఎక్కడి నుంచో ఒక బ్రహ్మాండమైన గద్ద వచ్చి, పొత్తి గుడ్డలను ముక్కుతోనూ, కాళ్ళతోనూ పట్టుకుని, ఆ బిడ్డతోసహా ఎటో వెళ్ళిపోయింది. హీరా దత్తుడు ఆ పక్షిని వేటాడటానికి వేటగాళ్ళను పంపాడు; తన బిడ్డను తెచ్చి ఇచ్చిన వారికి అంతులేని ధనం ఇస్తానని చాటింపు వేయించాడు. కాని అతని ప్రయత్నాలేవీ ఫలించలేదు.

ఇంతకూ, హీరాదత్తుడి బిడ్డను ఎత్తుకుపోయినది నిజంగా గద్ద కాదు. అది శాపం పొంది, కొంతకాలం పాటు యక్షలోకం నుంచి బహిష్కరించబడిన యక్షిణి. ఆమె పక్షి రూపంలో ఆకాశంలో తిరుగుతూ హీరా దత్తుడి కుమార్తెను చూసి, ఆ పిల్లను పెంచుకోవాలని ముచ్చటపడింది. పక్షి ఎత్తుకు పోయిన కారణంగా హీరాదత్తుడి కుమార్తెకు శకుంతకుమారి అన్న పేరు వచ్చింది.

శకుంతకుమారి యక్షిణి పెంపకంలో ఎంతో ప్రపంచజ్ఞానమూ, అనేక యుక్తులూ నేర్చుకుని, పెరిగి పదహారేళ్ళ వయసు దయింది.

అప్పుడు ఒకనాడు యక్షిణి శకుంతకుమారితో, "అమ్మా, నా శాపం గడువు తీరిపోయింది. నేనిక మా లోకానికి తిరిగి పోతాను. నీకు అందమూ, తెలివి తేటలూ ఉన్నాయి. ఏ రాజకుమారుడైనా నిన్ను కళ్ళ కద్దుకుని పెళ్ళాడతాడు. ఈ దిక్కుగా వెళ్ళావంటే నీ తండ్రి ఉండే వైశాలీనగరం వస్తుంది. నువ్వు మీ తల్లిదండ్రులను చేరుకుని, నీకు తగిన భర్తను పెళ్ళాడి, నేను నేర్పిన యుక్తులన్నీ



వినియోగించి సుఖంగా జీవించు,'' అని చెప్పి తన లోకానికి వెళ్ళిపోయింది.

శకుంతకుమారి తన జీవితమంతా అరణ్యం మధ్యనే గడిపినప్పటికీ ఆమెకు అన్నిరకాల నాగరిక జీవితం గురించీ పూర్తిగా తెలుసు. అందుచేత ఆమె నాగరిక జీవితంలోకి అడుగు పెట్టటానికి సిద్ధపడి, వైశాలీనగరం ఉండే దిక్కుగా బయలుదేరింది.

ఆమె అరణ్యంలో కొంతదూరం వెళ్ళేసరికి ఒక చోట ఒక విచిత్రమైన రాజభవనం కనిపించింది. ఆమె ఆ భవనంలోకి ప్రవేశించింది. అందులో ఏనుగులూ, గుర్రాలూ, ద్వారపాలకులూ, సేవకులూ, దాసీలూ-అందరూ గాఢ నిద్రలో ఉన్నారు. ఇంకా లోపలికి పోయి ఆమె విశాలమైన ఒక శయన మందిరం ప్రవేశించింది.

అక్కడ ఒక అందగాడైన రాజకుమారుడు హంసతూలికా తల్పం మీద పడుకుని ఉన్నాడు. ఆ గదిలో గోడకు ఒక చిత్తరువు వేళ్ళాడుతున్నది. అందులో ఈ రాజకుమారుడే గుర్రం మీద ఎక్కి ఉన్నాడు. అయితే అతని మెడలో ఒక హారం చిత్రించి ఉన్నది. ఆ హారం ఇప్పుడు రాజకుమారుడి మెడలో లేదు; అది అతని పాదాల దగ్గిర ఒక పెట్టెలో పెట్టి ఉన్నది.

ఆ హారం అతని మెడలో లేకపోవటానికీ, అతని గాఢనిద్రకూ ఏమైనా సంబంధం ఉన్నదేమో చూడాలని, శకుంతకుమారి ఆ హారాన్ని పెట్టె నుంచి తీసి, అతని రొమ్ముకు ఆనించింది. వెంటనే రాజకుమారుడు నిద్రలో మసిలి, లేవబోయేవాడిలాగా కనబడ్డాడు.

శకుంతకుమారి ఆ హారాన్ని తీసి తిరిగి పెట్టెలో పెట్టింది. తాను ప్రయాణం చేసి మట్టి కొట్టుకుని ఉన్నది. చక్కగా స్నానం చేసి, రాజభవనంలో నుంచి మంచి బట్టలు తీసి కట్టుకుని, రాజకుమారుడు కళ్ళు తెరిచే సరికి అందంగా తయారవుదామనుకున్నది శకుంతకుమారి.

ఆమె ఆ గది నుంచే అందమైన బట్టలు ఏరి తీసుకుని, సమీపంలోనే ఉన్న కొలనుకు వెళ్ళి, అందులో స్నానం చెయ్యసాగింది.

ఆ సమయంలో అటుగా ఒక కుబ్జ ఏడుస్తూ వెళ్ళటం ఆమెకు కనిపించింది. ఆ మనిషి గూనిదీ, అనాకారిదీ అయినప్పటికీ, ఆమె దుఃఖం చూసి జాలిపడి శకుంత కుమారి ఆమెను, ''ఎందుకు అలా దీనంగా

ఏడుస్తున్నావు? ఎక్కడికి పోతున్నావు?'' అని అడిగింది.

''నా మొగుడు నన్ను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాడు. నేను ఈ మహారణ్యంలో ఏ పులివాత అయినా పడతాను,'' అన్నది కుబ్జ.

''విచారించకు. నీ పోషణ నేను చూస్తాను. నువ్వు వెళ్ళి ఆ కనిపించే భవనం వద్ద ఉండు. నేను స్నానం పూర్తిచేసి వస్తాను,'' అన్నది శకుంతకుమారి.

కుబ్జ రాజభవనానికి వెళ్ళి లోపల ప్రవేశించి, రాజకుమారుడి గది చేరుకున్నది. శకుంతకుమారికి కలిగినట్టే కుబ్జకు కూడా హారం విషయం అనుమానం తగిలింది, ఆమె పెట్టెలోనుంచి హారాన్ని తీసి రాజకుమారుడి మెడకు తగిలించింది. త్వరలోనే రాజకుమారుడు మేలుకున్నాడు. అతనితోబాటు రాజ భవనం అంతా మేలుకున్నది.

తన నిద్ర వదిలించినందుకు కుబ్జను రాజకుమారుడు పెళ్ళాడ నిశ్చయించాడు.

''నేనొక రాజకుమార్తెను. నా దాసి ఇప్పుడే వస్తుంది,'' అన్నది కుబ్జ రాజకుమారుడితో.

ఆమె అన్నట్టుగానే శకుంతకుమారి అక్కడికి చేరుతూ, రాజభవనమంతా మేలుకుని ఉండటం చూసి మోసం జరిగిందని గ్రహించింది. దానికి తగినట్టుగానే శకుంతకుమారి రాగానే కుబ్జరాజకుమారుడితో, ''అదుగో, నా దాసి!'' అని చెప్పింది.

శకుంతకుమారి కుబ్జను నానా తిట్లూ తిట్టి, జరిగినదంతా రాజకుమారుడికి చెప్పింది.

''మీ ఇద్దరిలో ఎవరు దాసీ అయినదీ, ఎవరు రాణీ అయినదీ, ఎవరిని ఎవరు మోసం చేస్తున్నదీ నాకు తెలియటం లేదు. నేను ఇంతకు మునుపే నిద్ర లేచాను. నేను లేచేసరికి ఈ కుబ్జ ఎదురుగా కనిపించింది.



ఈమెకే నేను రుణపడి ఉన్నాననుకుంటు న్నాను,'' అన్నాడు రాజకుమారుడు.

''ఎవరు రాణీ అయిందీ, ఎవరు దాసీ అయిందీ ఇప్పుడే తేలుస్తాను. రాణీ అనీ, దాసీ అనీ చీట్ల మీద రాసి ఈ పెట్టెలో పోసి, చూడకుండా రాణీ చీటీలన్నీ నేను తీస్తాను. అప్పుడు మీకే నిజం తెలుస్తుంది,'' అన్నది శకుంతకుమారి. రాజకుమారుడు ఆ పరీక్షకు ఒప్పుకున్నాడు.

శకుంతకుమారి కొన్ని చీట్లు తయారు చేసి, వాటిమీద 'రాణి', 'దాసి' అని రాసి, చీట్లన్నిటిని ఒక పెట్టెలో వేసి, కళ్ళు మూసుకుని 'రాణి' అని రాసిన చీట్లన్నీ, ఒక్క బీరు పోకుండా తీసేసింది. పెట్టెలో మిగిలిన చీట్లు అన్నిటి మీదా 'దాసి' అనే ఉన్నది.

ఇది చూసి కుబ్జ వణికిపోతూ తాను చేసిన మోసం ఒప్పేసుకున్నది. శకుంతకుమారి కుబ్జను క్షమించి తన దాసిగా ఉండనిచ్చింది. రాజకుమారుడికీ, శకుంతకుమారికీ వైభవంగా పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి వైశాలీ నగరం నుంచి ఆమె తల్లిదండ్రులు వచ్చారు. ఏనాడో తమకు కాకుండా పోయిన తమ కుమార్తె తమకు తిరిగి దొరికినందుకు వాళ్ళు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

తన కథ అంతా శకుంతకుమారి తన తల్లిదండ్రులకు చెప్పింది. అప్పుడు తల్లి, ''కుబ్జకు మంచి పరాభవమే చేశావు. కాని, చీట్లు లాగటంలో నువ్వు ఏదో యుక్తిచేసి ఉండాలి. ఆ యుక్తి ఏమిటి?'' అని అడిగింది.

శకుంతకుమారి నవ్వి, ''ఏమీ లేదమ్మా! సూటిగా కత్తిరించిన అట్టముక్కలు తీసుకుని, ఒక్కొక్కటీ మూడుగా మడిచి, మధ్య భాగంలో 'రాణి' అనీ, రెండు చివర భాగాలలోనూ 'దాసి' అనీ రాసి, ఒక్కొక్క అట్టనూ మూడేసి ముక్కలుగా చించాను. 'రాణి' అని రాసి ఉన్న చీటీకి రెండు పక్కలా అంచులు గరుకుగా ఉంటాయి. 'దాసి' అని రాసి ఉన్న చీటీకి ఒక అంచు నున్నగానూ, ఒక పక్క అంచే గరుకుగానూ ఉంటుంది. అందుచేత, 'రాణి' ముక్కలు తడివి తెలుసుకోవటం తేలిక. కుబ్జ నన్ను మోసగించినందుకు నేను దాన్ని అలా మోసం చేశాను,'' అన్నది.



చిత్రాలు: గాంధి అయ్య 14

# అజేయుడు గరుడుడు!



చంద్రపురి నుంచి రాజగురువు సలహా ప్రకారం రాజ్యానికి ఈశాన్య దిశలో శిథిలావస్థలో ఉన్న ప్రాచీన ఆలయాన్ని వెతుక్కుంటూ వెళ్ళిన ఆదిత్యుడు వజ్రపురిలో ఆగాడు. ఆ రాత్రి ఆదిత్యుడికి ఏర్పడిన పెద్ద గండం నుంచి గరుడుడు కాపాడాడు.




ధ్యానంలో కూర్చున్న ఆదిత్యుడు కళ్ళు తెరిచి చుట్టుపక్కల కలయచూశాడు. అతని ఎదుట గరుడుడి రూపం కనిపించింది.

ఆ కంఠస్వరం ఇంకా ఇలా చెప్పసాగింది...










భీకర భూకంపం సంభవించడంతో, దేవాలయమూ చుట్టూ ఉన్న రాజధానీ నగరమూ భూమిలోకి కూరుకుపోయాయి. రాజ్యం ముక్కలు చెక్కలై పలువురి హస్తగతమై పోయింది.


అలా విడిపోయిన రాజ్యాలలో ఒక్క చంద్రపురికి మాత్రమే ధర్మపాలకులు సిద్ధించారు.


రాజధాని ఉన్న చోట కొండ ఏర్పడింది...


నువ్వు ఆ కొండ మీదే ఇప్పుడు నిలబడి ఉన్నావు.


ఆదిత్యా, ఆ దేవాలయ గత వైభవాన్ని మళ్ళీ తీసుకురావలసిన బాధ్యత నీకు ఉన్నది.


దివ్యస్వరూపా! ఆ కార్యం సాధించడానికి దైవసహాయం నాకు లభించగలదా?
ఉండడం వల్లే, నిన్ను వజ్రపురి నుంచి రక్షించి ఇక్కడికి తీసుకువచ్చాను.


ఆ మహత్కార్యాన్ని, మానవమాత్రుడు ఒంటరిగా సాధించలేక పోవచ్చు.













దుమ్ము, ధూళి అణిగాక, ఒకనాటి బ్రహ్మాండ దేవాలయ శిథిలాలు
గరుడుడికి కనిపించాయి.


అంతా మహాద్భుతంగా తోచింది. ఆదిత్యుడు నిర్విణ్ణుడై నిలబడ్డాడు.


మళ్ళీ పరిచిత కంఠస్వరం వినిపించింది...
ఇక నీకు అప్పగించిన పనులు నిర్వర్తించవలసిన బాధ్యత నీది!


ఆదిత్యుడు చూస్తుండగానే, అతని వద్ద ఈకను వదిలి, గరుడుడు అదృశ్యమై పోయాడు.


భటుల హర్షధ్వానాలు విని ఆదిత్యుడు తిరిగి చూశాడు.
యువరాజు విచ్చేశారు! ఆయన క్షేమంగా ఉన్నారు!


మీరందరూ ఇక్కడికి ఎలా రాగలిగారు?
వీరబాహు మమ్మల్ని ఇక్కడికి పంపారు. [cut off] చోటును వెతికి కనుగొనడానికి రోజం[cut off] పట్టింది.


మీలో ఒకరు వెళ్ళి నేను క్షేమంగా ఉన్నట్టు, మహారాజుకూ, వీరబాహుకూ తెలియజేయాలి. శిల్పకారులనూ, తాపీపనివాళ్ళనూ రప్పించాలి. ఇక్కడ చేయవలసిన పనులు బోలెడున్నాయి.
చిత్తం, యువరాజా! ఇప్పుడే బయలుదేరుతున్నాం.


ఆదిత్యుడూ, తక్కిన భటులూ ఆలయాన్ని చూడడానికి బయలుదేరారు.
-(ఇంకావుంది)

# ప్రత్యేకమైన స్త్రీల పండుగ

రాజస్థాన్‌లో జరుపుకునే పండుగలలో ప్రధానమైనది గంగౌర్ పండుగ. గంగౌర్ అనే పదంలో 'గణ్' పరమశివుణ్ణీ 'గౌర్' గౌరి అంటే పార్వతీ దేవినీ సూచిస్తాయి. అంటే ఇది ఆదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులకు సంబంధించిన పండుగ అన్న మాట. హోలీ తరవాత వచ్చే ఈ పండుగను స్త్రీలు పద్ధెనిమిది రోజుల పాటు జరుపుకుంటారు. పెళ్ళికాని అమ్మాయిలు తమకు మంచి భర్తలు లభించాలని పూజలు జరుపుతారు. వివాహితలైన ముత్తయిదువలు తమకూ, తమ భర్తలకూ ఆయురారోగ్యాలు ప్రసాదించమని ప్రార్థనలు చేస్తారు. పూజాకాలంలో స్త్రీలు రంగు రంగుల దుస్తులు ధరిస్తారు.

ఈ పండుగ రాష్ట్రమంతటా జరుపుకున్నప్పటికీ, ప్రత్యేకించి జయ్‌పూర్, ఉదయ్‌పూర్, జోధ్‌పూర్, బికానర్, జైసాల్మర్ నగర ప్రాంతాలలో మరింత ఘనంగా జరుపుకుంటారు. ఈ సమయంలో పార్వతీదేవి తనను పూజించే వారిని ఆశీర్వదించడానికి పుట్టినింటికి వస్తుందని భక్తులు విశ్వసిస్తారు. పద్ధెనిమిదవ రోజు పరమశివుడు వచ్చి ఆమెను తన ఇంటికి తీసుకువెళతాడు. భక్తులు ఆ సతీపతులకు ఘనంగా వీడ్కోలు పలుకుతారు.

ఈ ఉత్సవం మార్చ్-ఏప్రిల్ మధ్య జయ్‌పూర్‌లో అత్యంత వైభవంగా జరుపుకుంటారు. ఏనుగులూ, గుర్రాలూ, పల్లకీలూ పాల్గొనే ఈ ఊరేగింపులో బంకమన్నుతో, కొయ్యతో తయారుచేసిన పార్వతీ పరమేశ్వరుల అందమైన విగ్రహాలను ఊరేగిస్తారు. ముత్తయిదువలు ఈ విగ్రహాలను భక్తితో తమ తలలపై పెట్టుకుని తీసుకువెళతారు. పర్యాటకులతో సహా వేలాదిమంది ప్రజలు ఈ ఊరేగింపును ఆసక్తితో తిలకిస్తారు.

ఉదయ్‌పూర్ పిచోలా తటాకంలో ఈ విగ్రహాలను పడవలలో నయనానందకరంగా అలంకరించి తీసుకువెళతారు.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :



### కుళ్ళిన చెట్లు–చిత్తడినేల

నీళ్ళు నిలువ ఉండే ప్రాంతాలలో ఆక్సిజన్ కొరత వల్ల చెట్టు చేమలు, వాటి వేళ్ళు క్రమంగా కుళ్ళి పోతాయి. చిత్తడినేలలకు వెళ్ళి చూశామంటే కుళ్ళి పోయిన మందమైన పదార్థాలు పేరుకుపోయి కనిపిస్తాయి. చేరిన నీళ్ళు కిందికి వెళ్ళడానికి వీలులేని ప్రాంతాలలో ఈ చిత్తడి నేలలు ఏర్పడతాయి. వర్షం ద్వారా ప్రధానంగా ఇక్కడికి నీళ్ళు చేరుతాయి.

కుళ్ళిన చెట్టుచేమలు పదార్థాలవల్ల చిత్తడినేల జలాలు క్షార పూరితాలవుతాయి. ఈ క్షారగుణం కుళ్ళిన మొక్కలను నిలవచేస్తాయి. ఈ చిత్తడినేలలలో శతాబ్దాల నాడు పుట్టిన మొక్కలను కూడా వృక్ష శాస్త్రజ్ఞులు గుర్తించి కనుగొంటున్నారు. 'స్ఫగ్నమ్ మాసస్' జాతిమొక్కలు ఇక్కడ మామూలుగా పెరుగుతూ ఉంటాయి. కుళ్ళిన చెట్లు, వేళ్ళ మీద క్రమంగా బంకమన్ను, ఇసుక పేరుకుపోవడం వల్ల, కొన్ని శతాబ్దాల కాలంలో అవి బొగ్గుగా మారుతాయి.

## మన పరిసరాలు

### సూర్యరశ్మి – మనిషి ఆరోగ్యం



ప్రకృతిమాత మనకెన్నో అమూల్యమైన కానుకలను ప్రసాదిస్తోంది. అలాంటి వాటిలో సూర్యరశ్మి ప్రధానమైనది. చెట్టు చేమలకు సూర్యరశ్మి ఎంత ప్రయోజనకరమో చెప్పనవసరం లేదు. మనిషి ఆరోగ్యానికి బంగారు సూర్య కిరణాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. సూర్యుడి నుంచి వచ్చే వెలుతురు మనిషి మెదడులోని పీనియల్ గ్లాండ్‌ను ఉత్తేజపరుస్తుంది. ఇందువల్ల ట్రిప్టామైన్స్ ఉత్పత్తి అవుతాయి. అవి మనిషిలో ఉత్సాహాన్ని పెంచుతాయి.

మనిషి చర్మం మీద పేరుకుపోయే హానికరమైన ఫంగస్‌ను, బ్యాక్టీరియాను కూడా సూర్యకిరణాలు నాశపరుస్తాయి. సూర్యరశ్మికి రక్తంలోని తెల్లకణాలు కూడా ఉత్తేజితమవుతాయి.

మన శరీరం విటమిను డిని మాత్రమే తయారుచేసుకోగలుగుతున్నది. అది సూర్యరశ్మి ఉన్నప్పుడు మాత్రమే సాధ్యం. అందుకే విటమను డిని సూర్యరశ్మి విటమిను అని కూడా చెబుతారు. విటమిను డి ఎముకలు, దంతాల ఆరోగ్యానికి చాలా అవసరం అన్నది తెలిసిన విషయమే.

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మీకు తెలుసా?

### పురుగు కాని పురుగు



పురుగుకాని పురుగు ఏదో మీకు తెలుసా? పెరిపేటస్! గొంగళి పురుగులా కనిపించే చిన్న జంతువు ఇది. దీనికి చిన్న చిన్న కాళ్ళూ, పొడవాటి మెత్తటి శరీరమూ ఉంటాయి. 'వెల్వెట్ పురుగు' అనీ 'నడిచే పురుగు' అనీ దీనిని పిలుస్తారు. అయితే, నిజానికి ఇది పురుగు కాదు. మామూలుగా వెచ్చటి దేశాల్లోని ఈ ప్రాణులు రాత్రుల్లో సంచరిస్తూ ఉంటాయి. పన్నెండు సెం.మీ. పొడవుతో, నీలం, ఊదా, బూడిద రంగులతో ఇవి ఉంటాయి.

పెరిపేటస్ మామూలుగా కీటకాలను, పురుగులను, నత్తలను తింటుంది. పెరిపేటస్ తల భాగంలో రెండు పెద్ద పెద్ద లాలాజల గ్రంథులు ఉన్నాయి. ఈ గ్రంథుల నుంచి జిగట పదార్థాన్ని కీటకాల మీదికి చిమ్ముతుంది. దాంతో అవి కదలలేక పోవడంతో వెళ్ళి పట్టుకుని మింగేస్తుంది!

## మన దేశం క్విజ్

### ఈనెల మన మతాల గురించి తెలుసుకుందాం

1. భగవద్గీతలో మొత్తం ఎన్ని అధ్యాయాలున్నాయి?





2. ఏసుక్రీస్తు ఏ రోజు శిలువ చేయబడ్డాడు? ఏ రోజు మళ్ళీ కనిపించాడు?

3. పవిత్ర 'ఖొరాను' ఏ భాషలో రచింపబడింది?





4. 'బుద్ధుడు' అనే మాటకు అర్థం ఏమిటి?

(సమాధానాలు 66వ పేజీలో)

## చందమామ క్విజ్ - 12 (జనవరి '07) విజేతలకు అభినందనలు

1. జి. విజయలక్ష్మి, మచిలీపట్నం - 521 002, కృష్ణా జిల్లా (ఆం.ప్ర)
2. ఓరుగంటి నాగసాయి అఖిలేష్, సంతోష్‌నగర్, కర్నూలు - 518 003(ఆం.ప్ర)
3. సి హెచ్.వై. స్వరోచి, నర్సీపట్నం - 531 116, విశాఖ జిల్లా (ఆం.ప్ర)
4. ఎ.వి. నరేన్, లలితానగర్, హైదరాబాద్ - 44 (ఆం.ప్ర)
5. కొండా వినోద్, బందారులంక - 533 221, తూ.గో. జిల్లా (ఆం.ప్ర)

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మే 2007 సంచికలో ప్రచురిస్తాం.

ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600032.

## అభినందనలు

**జనవరి నెల పోటీ ఫలితాలు**

జవ్వాజి శ్రీనివాసులు
తం.పే.వెంకటనారాయణ
10/581, రామలక్ష్మణ వీధి
మార్కాపురం - 523 316
ప్రకాశం జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : సశ్య రక్షణకు ఒకరు!

రెండవ ఫోటో : దేశరక్షణకు మరొకరు!

## సమాధానాలు :

1. 18 అధ్యాయాలు.
2. శుక్రవారం; ఆదివారం.
3. అరబిక్.
4. జ్ఞానం పొందినవాడు.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)

# నా పేరు 'శక్తి'!




నన్ను 'శక్తి' అంటారు. పనిచేయడానికి కావలసిన సామర్థ్యంగా శాస్త్రజ్ఞులు నన్ను పేర్కొంటారు. తాపశక్తి, విద్యుచ్ఛక్తి, యాంత్రిక శక్తి అంటూ నాకు వివిధ రూపాలు ఉన్నాయి. ఇవాళ నా కారణంగానే మీరు అనేకపనులు చేసుకోగలుగుతున్నారు. అది నాకెంతో గర్వంగా ఉంది. మీరు సుఖంగా జీవించ గలుగుతున్నారంటే అది నావల్లే. రోజువారీ పనులకు మీరు నా మీద ఆధారపడక తప్పదు. మీరు నన్ను సక్రమంగా ఉపయోగించుకున్నంతకాలం మీకు నేను ఉపయోగపడతాను. అయితే, దుర్వినియోగం చేస్తే మాత్రం నాకు మహా చిరాకు కలుగుతుంది.

ఉదాహరణకు చెప్పాలంటే-మీరు ఇంట్లో ఉన్నప్పుడు అవసరం లేనప్పుడు ఫ్యాన్లు ఆఫ్ చేయకపోతే బాధ వేస్తుంది. రాత్రుల్లో పడుకునే ముందు వంట గదిలో, బాల్కనీలో లైట్లు ఆఫ్ చేయకుండా వెళితే చిరాకు కలుగుతుంది. కిటికీలు తెరిచి ఉన్నప్పుడు ఎ సి ఆన్ చేస్తే కోపం వస్తుంది. ఏ అల్లరి కుర్రాడయినా బడిలో కొళాయిని సరిగ్గా మూయక పోతే విలవిలలాడి పోతాను. ఫ్యాక్టరీలలో మిషన్ల నుంచి ఆయిల్ కారుతూ ఉండడం చూస్తే నా గుండె తరుక్కు పోతుంది. పనిలేనప్పుడు మిషన్లను ఆపకుండా పోయేవాళ్ళన్నా, అవసరం లేనప్పుడు కంప్యూటర్లను ఆన్ చేసి ఉంచే వాళ్ళన్నా నాకు మహామంట.

దయచేసి ఇలాంటి వృథా చేసేపనులు మీరు చేయకండి. చాలా మంది ఇలా చేయడం వల్ల చెప్పలేనంత నష్టం వాటిల్లుతుంది. శక్తిని పొదుపు చేయడం అన్నది మీ ఇంటి నుంచి ప్రారంభించండి. పాఠశాలలలో, పనిచేసే స్థలాలలోనూ పాటించండి. ప్రతిచోటా మీ వైఖరి ఒకే విధంగా ఉండాలి. అదే ఇంటికీ, దేశానికీ మంచిది. దేశ సంపదల అభివృద్ధికి సాయపడుతుంది.

CHANDAMAMA (Telugu) Mar. 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08